## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **ద్వారకాదీష్ వాస్తు** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **ద్వారకాదీష్ వాస్తు** వారి వెబ్ సైట్: http://dwarkadheeshvastu.com
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## ద్వారకాదీష్ వాస్తు వారి వెబ్ సైట్:

## http://dwarkadheeshvastu.com

Free Download Indian epic ×

dwarkadheeshvastu.com/Epic-List-of-Indian-Epics-in-Telugu.aspx

Hindi | Sanskrit | English | Gujrati | Bangali | Oriya | Telugu | Nepali | Marathi | Kannad | Asamiya | Urdu | Malyalam | Avdhi | Ved | Puran | Bhagwat | Ramayan | Geeta | Punjabi | Jain Dharm | Islam | Karm Kand

**Dwarkadheesh Vastu**

Home
Contact Us
हिन्दी वेबसाईट
Vastu Consultancy
Download Vastu Book
FREE Astrology Books

FREE Devotional Music (Mp3)
FREE Devotional Videos
FREE Devotional Books (PDF)
FREE Educational Books (PDF)
FREE Educational Videos
FREE Devotional Wallpapers

Dwarkadheesh Vastu
Like
3,663 people like Dwarkadheesh Vastu.
Facebook social plugin

A | B | C | D | E | F | G | H | I

J | K | L | M | N | O | P | Q | R

S | T | U | V | W | X | Y | Z

1. 12 Rashi Fal (Hindi)
2. 300 Saal Sikh Itihaas De Naal (English)
3. Aachar Manjari (Nepali)
4. Aadarsh Bhakti Prem (Telugu)
5. Aadarsh Dampatya Jeevan (Telugu)
6. Aadarsh Desh Bhakt (Hindi)
7. Aadarsh Manav Hridaya (Hindi)
8. Aadarsh Nari Sushila (Bengali)
9. Aadarsh Nari Sushila (Gujrati)
10. Aadarsh Nari Sushila (Tamil)

### Indian Epics in Telugu

1. Aadarsh Bhakti Prem (Telugu)
2. Aadarsh Dampatya Jeevan (Telugu)
3. Aadarsh Nari Sushila (Telugu)
4. Aadhyatm Ramayan (Telugu)
5. Aandhra Mahabhagwat Dasham Skandh (Telugu)
6. Agni Puranam (Telugu)
7. Aladdin Adbhutha Deepam (Telugu)
8. Alibaba Dongalu Katha (Telugu)
9. Amavasya Somavara Vratham (Telugu)
10. Amma Neeti Kathalu Katha (Telugu)
11. Amulya Samaya Ka Upyog (Telugu)
12. Anantapadmanabha Asthotram (Telugu)

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# విషయ సూచిక


| సంఖ్య. | కథపేరు | | పుట. |
|---|---|---|---|
| 1. | చక్రవేణమహారాజు త్యాగమహిమ. (కథ) | ... | 5 |
| 2. | సర్వభూతహితే రతాః. (కథ) | ... | 17 |
| 3. | జీవన సాఫల్యానికై ఉత్తమశిక్షణ. (కథ) | ... | 34 |
| 4. | భగవానుని పరమదివ్యగుణసంపన్న స్వరూప ధ్యానము. | ... | 59 |
| 5. | శ్రద్ధ, ప్రేమ, సాధనలో తత్పరత - వాని ఆవశ్యకత. | ... | 73 |




# 1. చక్రవేణమహారాజు త్యాగమహిమ

ఈ చక్రవేణమహారాజు చరిత్రను నేను ఏ గ్రంథంలోనూ చూచియుండలేదు. ఇది పారంపరికంగా లోకములో ప్రసిద్ధిగన్న చరిత్ర, ఇది నిజమా లేక కల్పితగాథయా? అని అడిగితే నేను సమాధానం చెప్పలేను. ఇది ఎట్టిదైనా కానీయండి. మనం దీనినుండి నీతిని గ్రహించవలెననుమాట నిజం. ఈ కథావిధానమిలా ఉంది.

ఒకానొకప్పుడు చక్రవేణుడు అనుపేర ఒక మహారాజు ఉండేవాడు. అతడు గుణసంపన్నుడు. సదాచారపరాయణుడు, ధర్మాత్ముడు, సత్యవాది. తనపైతాను ఆధారపడువాడు. పరిశ్రమించు స్వభావము గలవాడు. త్యాగశీలుడు, విరాగి, జ్ఞాని, భక్తుడు, తేజశ్శాలి, తపోమూర్తి, ఉన్నతశ్రేణికి చెంది అనుభవశాలిన్రైన మహాపురుషుడు. అతడు రాజ్యసంబంధమైన ద్రవ్యాన్ని తన కోసము, తన భార్యకోసము వినియోగించుకోవడం దోషంగా భావించి దానిని ముట్టక దూరంగా ఉండేవాడు. పన్నులరూపములో ప్రజలనుండి వసూలుచేసిన ద్రవ్యాన్ని వారి క్షేమంకోసమే వినియోగించే వాడు. రాజ్యకార్యాలను అతడు ప్రతిఫలాపేక్షను, అభిమానాన్ని వర్జించి తనువును, మనమును లగ్నంచేసి నిర్వర్తించేవాడు. ప్రజలమీద అతని ప్రభావం ప్రబలంగా ఉండేది. రామరాజ్యంలోవలెనే అతని రాజ్యంలోని ప్రజలెల్లరూ దుఃఖమన్నది ఏమిటో ఎరుగక సర్వవిధ సుఖసంపదలతోను తులదూగుతూ ఉండేవారు.

ఆ మహారాజు తన జీవన నిర్వహణంకోసం ప్రత్యేకముగా

వ్యవసాయం చేసుకొనేవాడు. ఎద్దులకు బదులుగా మహారాణి స్వయముగా నాగలిని లాగేది. మహారాజు విత్తనాలను చల్లేవాడు. అతడు తన పొలములో పండిన పంటతోనే తన జీవననిర్వహణం సాగించుకొనేవాడు. అతడు తన పొలములో చెరకు, ప్రత్తి, ధాన్యము, ఫలాలు, ఆకుకూరలు పండించుకొనేవాడు. తన పొలములో పండిన ప్రత్తితోనే వస్త్రం తయారు చేసుకొని ధరించేవాడు. తన పొలములో పండిన చెరకుతోనే బెల్లం తయారుచేసుకొని తినేవాడు. తన పొలములో పండిన అన్నాన్ని, ఫలాలను, ఆకుకూరలను మాత్రమే ఆహారంగా ఆరగించేవాడు. అతని భార్యకు ధరించడానికి ఆభరణాలు ఏవీ ఉండేవికావు. కారణమేమంటే అతడు రాజ్యద్రవ్యాన్ని వినియోగించి ఆమెకు ఆభరణాలు ఏవీ చేయించేవాడు కాడు. వారి పొలంలో పండేపంట వారికి సాధారణమైన అన్నపానవస్త్రాదులతో కాలం గడపడానికే సరిపడుతూ ఉండేది. ఒక్క పొలం పనులకేకాక అతడు రాజ్యకార్యాలకోసం కూడా కాలాన్ని వినియోగిస్తూ ఉండేవాడు. అతని జీవనం సదాచారసంపదతో సాదాగా బ్రతికే ఒకరైతు జీవితాన్ని పోలి ఉండేది. ప్రతిదినము ఆరుగంటల కాలము నిద్రకుపోగా మిగిలిన కాలమంతా అతడు భగవద్భక్తి, పరోపకారము, రాజ్యకార్యనిర్వహణము, పొలంపనులు చేసుకొనుటకు వినియోగించేవాడు. అతనికి ఎల్ల జీవులయెడల సమత్వము, దయ, ప్రేమ సమానముగా ఉండేవి. అతడు సమస్తప్రాణులను పరమాత్మస్వరూపములుగా భావించి అందరకు నిష్కామప్రేమభావంతో సేవలు చేసేవాడు. అతడు తనపై తాను ఆధారపడువాడు. తన శరీరానికి సంబంధించిన పనులనన్నిటినీ తానే స్వయంగా నిర్వర్తించుకొనేవాడు. సేవకులచేత కాని, రాజ్యసంబంధమైన యితర కర్మచారులచేత కాని తాను ఏ పనీ చేయించుకొనేవాడుకాడు. అతడు ఏ పని చేసినా ఆసక్తిని, అహంకారాన్ని వీడి ఎంతో ఉత్సాహంతోను, ధైర్యంతోను చేస్తూ ఉండేవాడు.

ఇలా ఉండగా ఒకనాడు ఆ చక్రవేణమహారాజు నివసిస్తున్న దేశంలో ఒక గొప్ప తీర్థము (ఉత్సవము) జరిగింది. నగరంలోని వేర్వేరు ప్రాంతాల ప్రజలందరూ అందు పాల్గొన్నారు. సాధారణంగానే మహారాజును, రాణిని దర్శించడంకోసం జనులు తరచుగా వస్తూ ఉండేవారు. ఆనాడు ఉత్సవం

కారణంగా జనసమ్మర్దం అధికం అయింది. మహారాజు దగ్గరకు పురుషులు, రాణి చెంతకు స్త్రీలు అధికంగా వస్తూ ఉండేవారు. ఒకనాడు బహుమూల్యములైన పట్టువస్త్రాలను, సువర్ణాభరణాలను ధరించి తమతమ పరిచారికలను అందరను వెంటబెట్టుకొని ఎందరో ధనికవ్యాపారుల భార్యలు పరమాడంబరంతో రాణిని దర్శించుటకు ఆమె కడకు వచ్చారు. అప్పుడు వారు సాధారణవేషంలో ఉన్న రాణిని చూచి ఆమెతో ఇలా అన్నారు – "రాణిగారూ! మీరు ధరించునట్టి బట్టలను మా పరిచారికలు కూడ కట్టుకోరు. ఇదిగో మా దాసీవర్గాన్ని చూడండి. వీరు ఎంత విలువైన వస్త్రాలను ధరించారో చూచారా? నిజానికి మా వస్త్రాభరణాలకన్న మీ వస్త్రాభరణాలు మిన్నగా ఉండాలి. వీరు మాకు ఎట్లు పరిచారికలో మేము మీకు అట్టి పరిచారికలవంటివారము. మీ భర్త మాకు మహారాజుగారు. మీరు ఆయనకు ఏ కొంచెం సూచన చేసినా ఆయన మీకు మేము ధరించేవానికన్న మేలైన వస్త్రాభరణాలను సమకూర్చగలరు. మీరు మాకు సమ్రాజ్ఞులు. అట్టి మిమ్ము ఈ వేషంలో మేము చూడలేకున్నాము. ఇట్టి వస్త్రములను ధరించుటకు బిచ్చం ఎత్తుకొనే బిచ్చగత్తెకూడ ఇచ్చగింపదు. ఒక సమ్రాట్టుకు సామ్రాజ్ఞిగా ప్రత్యేకతను వెల్లడించే వేషభూషణాదులు మీకు ఉండాలి. ఆ రూపంతోనే మేము మిమ్ము చూడగోరుతున్నాము." ఇట్లు పలికి తమ మాటలతో రాణిని ప్రభావితురాలిని గావించి వారు వెడలిపోయారు. వారి మాటలు ఆమె హృదయఫలకంమీద అంకితం అయిపోయాయి.

రాత్రి మహారాజు ఇంటికి మరలి వచ్చినప్పుడు రాణి జరిగిన సంఘటనంతా అతనికి తెలియజెప్పింది. ఆనాటి పగటివేళ ధనికవ్యాపారుల భార్యలు తనతో అన్న మాటలు అన్నీ వివరించి "తనకోసం బహుమూల్యములైన వస్త్రాభరణాదులను సమకూర్చవలెను." అని అతనిని కోరింది.

ఎలా తెప్పించగలను? రాజ్యద్రవ్యాన్ని ఉపయోగించడంమాట అటుంచి దానిని తాకనైనా తాకనివాడను గదా నేను. ఆ ద్రవ్యాన్ని స్పృశిస్తే బుద్ధి భ్రష్టం అవుతుందన్నాడు మహారాజు.

మహారాణి ఉన్నతశ్రేణికి చెందిన సాధ్వీలలామ. అయిననేమి? ధనికవ్యాపారుల భార్యలు పలికిన మాటలు ఆమె చిత్తఫలకంమీద ముద్రితములయ్యాయి. వానిని ఆమె మరవలేకున్నది. అందుచేత ఆమె "స్వామీ! ఏమైన కానిండు. మీరు సమ్రాట్టులు. నేను మీకు పట్టపురాణిని. నా కోసం దయచేసి ఒక పట్టపురాణి ధరింపదగిన బహుమూల్యపు వస్త్రాభరణాదులను మీరు తెప్పించక తప్పదు." అని మహారాజును కోరింది.

అప్పుడు మహారాజు తనలో – "రాణియెంతగా వేడుకొన్నా ఎట్టి పరిస్థితిలోనూ కూడ రాజ్యద్రవ్యాన్ని నేను స్పృశింపజాలను కాని నేను సమ్రాట్టును. కావున దుష్టులు, అత్యాచారులు, బలవంతులు అయిన రాజులనుండి పన్నువసూలు చేయవచ్చును అని తర్కించుకొన్నాడు. అనంతరం అతడు పరరాష్ట్రాలకు, సామంతరాజ్యాలకు సంబంధించిన కార్యక్రమాలను నిర్వర్తించే మంత్రిని రావించి – "మంత్రివర్యా! మీరు వెంటనే రాక్షసరాజైన రావణుని కడకుపోయి రావణా! నేను చక్రవేణమహారాజు పంపగా వచ్చినవాడను. పన్నురూపంలో 1.1/4 మణుగు బరువుగల బంగారాన్ని నీకడనుండి వసూలు చేసి తీసుకొని రమ్మని నాకు మా మహారాజు ఆజ్ఞ. కావున వెంటనే పన్ను చెల్లింపుమని చెప్పండి." అని అతనికి ఆదేశించాడు.

సమ్రాట్టుయొక్క ఆదేశానుసారం కొందరు వ్యక్తులను వెంట బెట్టుకొని మంత్రి వెంటనే రథాన్ని అధిరోహించి సముద్రతీరానికి చేరి అక్కడనుండి పడవలో సముద్రాన్ని దాటి లంకలో ప్రవేశించాడు. క్రమంగా రావణుని కొలువులో ప్రవేశించి ఎంతో వినయంతోను, సభ్యతతోను, చక్రవేణ మహారాజుయొక్క సందేశాన్ని అతనికి వినిపించాడు. ఆ సందేశాన్ని ఆలకించి రావణుడు పక్కున నవ్వి సభలో ఉన్న తనవారితో– "విన్నారా! సభాసదులారా! ఇంకా ఇలాంటి మూర్ఖపు రాజులు కూడ లోకంలో ఉన్నారన్నమాట. ఋషులు, దేవతలు, దానవులు ఎల్లరనుండి పన్నువసూలుచేసే మహాబలవంతుడనైన నావంటి సర్వతంత్రస్వతంత్ర సమ్రాట్టునుండి ఈ మూర్ఖరాజు పన్నును అపేక్షిస్తున్నాడు" అని పలికెను.

అటుపిమ్మట ఆ మంత్రిని బంధింప తలపెట్టాడు. కాని వలదని సభాసదులు వారింపగా అతనిని బంధింపక విడిచిపెట్టాడు. అప్పుడు ఆ మంత్రి రావణుని కొలువునుండి వెలికి వచ్చి క్రమంగా సముద్రతీరానికి మరలివచ్చాడు.

అనంతరం ఆనాటి రాత్రి రావణుడు మందోదరి మందిరానికి అరిగినప్పుడు ఆమెతో నవ్వుతూ వినోదంగా ఇలా అన్నాడు - "దేవీ! ఎవరో భారతదేశపు చక్రవర్తియుట. పేరు చక్వవేణుడట. అతని దూత ఒకడు ఈనాడు నా కొలువులోనికి ప్రవేశించి పన్ను రూపంలో నన్ను 1.1/4 మణుగు బరువుగల బంగారం ఇమ్మని తన రాజాజ్ఞగా చెప్పాడు. వాని మాటలు విని నాకు నవ్వు వచ్చింది. నావంటి మహాప్రతిభాశాలియైన సమ్రాట్టునుండి కూడ పన్ను వసూలు చేయతలపెట్టే పరమమూర్ఖపాలకులు ఇంకా లోకంలో ఉన్నారన్నమాట. విన్నావా! నేను వానిని బంధింపతలచాను. కాని సభాసదుల కోరికమీద వదలివేశాను.

అనగా విని మందోదరి యిలా అంది - "స్వామీ! మీరు పొరపాటుపని చేశారు. నేను ఆ చక్వవేణమహారాజును ఎరుగుదును. అతడు సత్యవచనుడు, ధర్మాత్ముడయిన మహారాజు. అతని ఆజ్ఞను పాలింప నిరాకరించినవానికి అనర్థం వాటిల్లుతుంది. ఆ దూతను సంతుష్టునిగావించియే మీరు పంపి యుండవలసినది. ఇప్పుడైన అతడు ఎక్కడ ఉన్నాడో వెదకి రప్పించి వానికి సంతోషం గలిగించండి, లేకుంటే మనకు ఎంత అనర్థం సంభవిస్తుందో చెప్పలేను.

ఆ మాటలు విని రావణుడు మరల - "దేవీ! నీవు వట్టి పిరికిదానవు. సాధారణమానవమాత్రరాజులకు మనం భయపడవలసిన పనిలేదు. ఇట్టివారిని తలచి నేను ఈషణ్మాత్రము భయపడను" అన్నాడు. అప్పుడు "ఈరేయి గడచి తెల్లవారినమీదట మీకు నేను ఆ చక్వవేణుని ప్రభావం ఎట్టిదో చూపిస్తాను" చూడండని మందోదరి పలికింది.

క్రమంగా ఆ రేయి గడచి తెల్లవారింది. అప్పుడు మందోదరి తన

భర్తను వెంటబెట్టుకొని తమమేడ పైభాగానికి చేరింది. అక్కడ ఆమె ప్రతిదినము పావురాలకు బియ్యపుగింజలు చల్లి పెడుతూ ఉండేది. ఆ గింజలను తినడంకోసం అక్కడకు ఎన్నోపావురాలు వస్తూ ఉండేవి. గింజలను ఏరుకొని తింటున్న ఆ పక్షులతో – "ఇక గింజలను ముట్టకండి ముట్టుకున్నారంటే రావణచక్రవర్తి మీద ఆన. జాగ్రత్త!" అని మండోదరి పలికింది. ఆ పలుకును వినికూడ పక్షులు గింజలు గ్రహించడం మానలేదు. అప్పుడు ఆమె – "చూచారా? మీరు ఎదుటనే ఉన్నా, మీమీద ఆన పెట్టినా కూడ ఈ పక్షులు తినటం మానలేదు." అని రావణునితో అన్నది. అప్పుడు రావణుడు ఆమెతో – "మూర్ఖురాలా! ఆ పక్షులకు ఏమి తెలుస్తుంది? అవి తెలివిలేని జీవులు కదా! అని అన్నాడు. అంతట మందోదరి ఇప్పుడు చక్వవేణమహారాజు ప్రభావాన్ని చూడండి! అని అంటూ – "పక్షులారా! ఇక గింజలను ముట్టకండి! ముట్టుకున్నారంటే చక్వవేణమహారాజుమీద ఆన. జాగ్రత్త!" అని పక్షులను హెచ్చరించింది.. ఆ మాట విన్న వెంటనే పక్షులన్నీ ఒక్కసారిగా గింజలను గ్రహించడం మానివేశాయి. కాని వానిలో ఒక చెవిటి పావురం ఉంది. దానికి ఆ హెచ్చ రిక వినిపించక గింజలను గ్రహించింది. వెంటనే దాని తలతెగి అది నేల కూలింది. అప్పుడు మందోదరి – "చూచారు కదా స్వామీ! చక్వవేణమహారాజుమీద ఆన అని అన్న వెంటనే పక్షులు అన్నీ గింజలు ముట్టడం మానివేశాయి. కాని ఒక పావురం చెవిటిదై హెచ్చరికను వినక గింజలను ముట్టింది. వెంటనే చక్వవేణుని చక్రం చేత ఖండితయై నేల కూలింది." అని రావణునితో పలికింది. అనంతరం ఆమె పక్షులను ఉద్దేశించి – పక్షులారా! చక్వవేణమహారాజుయొక్క ఆనను ఉపసంహరిస్తున్నాను. ఇక మీరు యథాపూర్వంగా గింజలను గ్రహించండి" అని పలికింది. వెంటనే అవి గింజలను తినసాగేయి. మరల మండోదరి మీ ముందే నిలిచి ఉన్న యీ రావణచక్రవర్తి మీద ఆన. గింజలు ముట్టకండి! అని పలికింది. అయినా రావణుడు తమ యెదుటనే నిలిచి ఉన్నా అవి గింజలను ఏరుకొని తినడం మానలేదు. అప్పుడు ఆమె– "చూచితిరి కదా! ఈ పక్షులమీద మీ ప్రభావం ఈషణ్మాత్రము లేదు. కాని చక్వవేణమహారాజు ప్రభావాన్ని గూర్చి ఆలోచించండి. అతడు ఇక్కడ లేకపోయినా అతని ప్రభావం ఈ పక్షుల మీద ఎంతగానో ఉంది" అని

రావణునితో అంది.

"కాదు కాదు, నీవు ఏదో మాయ చేస్తున్నావు. కాకుంటే పాపం ఈ పక్షులకు ఏమి తెలుస్తుంది?" అని పలికి రావణుడు మందోదరి మాటలను కాదని త్రోసిపుచ్చి అచ్చటనుండి కదలి తన రాజసభకు వెడలిపోయేడు.

ఇక అక్కడ సభలోనుండి బయటకు వెడలిపోయిన చక్రవేణుని మంత్రి సముద్రతీరానికి చేరి అక్కడ లంకానగరపు నమూనాను ఒకదానిని రచించాడు. కాటుకవలె మెత్తగా ఉండే మట్టిని గ్రహించి దానిని సముద్రపు నీటితో తడిపి రబ్బరువలె సాగునట్లుచేసి తీరమందలి కొంత ప్రదేశాన్ని చతురస్రాకారంగా తీర్చిదిద్ది అచ్చట ఆమట్టితో పిల్లలు ఆడుకునే బొమ్మశిల్పం లాగున చిన్నదిగా లంకయొక్క నమూనా రచించాడు. చిన్న చిన్న మట్టి ఉండలతో లంకానగరపు ప్రాకారాలు, ద్వారాలు, బురుజులు మొదలైన వానిని రచించాడు. ప్రాకారానికి నాలుగు దిక్కులా స్తూపాకారాలను, శిఖరాలను, రచించి లోపల రాజధానిని, నగరంలోని ప్రసిద్ధభవనాలను కూడ చిన్నచిన్న మూర్తులుగా రచించి చూపాడు. ఇట్లు రచనాక్రమం అంతా పూర్తిచేసి అతడు మరల రావణుని కొలువులోనికి చేరాడు. అతనిని చూచి ఉలికిపాటు చెంది రావణుడు "ఏమయ్యా! మరల ఎందులకు వచ్చావు?" అని ప్రశ్నించెను. "నేను మీకు ఒక వినోదాన్ని ప్రదర్శింపదలచి వచ్చాను. మీరు నావెంట సముద్రతీరానికి రండి" అన్నాడు మంత్రి. ఆ వినోదమేదో చూడాలని అభిలషించాడు రావణుడు. కొందరు సభాసదులను వెంటబెట్టుకొని ఆ మంత్రిని అనుగమించి సముద్రతీరానికి చేరాడు.

అప్పుడు మంత్రి "చూడండి! ఇది అచ్చంగా మీ లంకానగరపు నమూనా అవునా కాదా!" అని తన రచనను చూపి రావణుని ప్రశ్నించాడు. రావణుడు అతని అద్భుతమైన పనితనాన్ని చూచి "బాగుంది! బాగుంది! ఇది చూపడానికా నన్ను ఇక్కడకు రమ్మన్నావు?" అన్నాడు. "కాదు, కాదు, ఈ నమూనాతో మీకు ఒక వినోదాన్ని ప్రదర్శిస్తాను. ఇదిగో ఇక్కడ చూడండి తూర్పుగా ఉన్న ఈ ప్రాకారము, ద్వారము, బురుజు, శిఖరము, సర్వము

మీ కోటకు తూర్పుగా ఉన్నవానిని పోలియున్నవా? లేవా?" అన్నాడు మంత్రి. ఉన్నాయి. ఉన్నాయి అన్నాడు రావణుడు. "నేను రచించిన నమూనా లంకయొక్క తూర్పుద్వారపు స్తూపశిఖరాన్ని కొన్ని బురుజులను చక్రవేణమహారాజు మీద ఆనపెట్టి కూలగొడుతున్నాను. దీనితోపాటు మీ నిజలంకానగరానికి తూర్పున ఉన్న స్తూపశిఖరాలు, బురుజులు కూలిపోవడం మీరు చూడగలరు" అని అంటూ మంత్రి మహారాజు చక్రవేణుని మీద ఆన" అని పలికి తాను రచించిన నమూనాలో తూర్పున ఉన్న స్తూపాకృతులను, బురుజులను కూలద్రోసెను. వానితోపాటు తన నగరానికి తూర్పుగా ఉన్న స్తూపాదులన్నీ గుభిల్లుమంటూ కూలిపోవడం రావణుడు చూచాడు. అతనికి ఎంతో ఆశ్చర్యం కలిగింది. అటు పిమ్మట దూతగా వచ్చిన మంత్రి మరల రావణునితో "రాక్షసరాజా! ఇప్పుడు నేను నారచనలో తూర్పున ఉన్న ప్రధానములైన నాలుగు బురుజులను ఊడగొట్టడం ద్వారా మీ నిజనగరానికి తూర్పుగా ఉన్న ప్రధానపు బురుజులను నాల్గింటినీ కూలద్రోస్తున్నాను చూడండి!" అంటూ చక్రవేణమహారాజు మీద ఆన అని పలికి తాను రచించిన నమూనాలో తూర్పుగా ఉన్న పెద్ద బురుజులను నాల్గింటినీ పడద్రోసెను. ఆ చర్యతో రావణుని నిజనగరానికి తూర్పున ఉన్న పెద్ద బురుజులు నాలుగూ నేలగూలాయి. అది చూచి రావణునకు మరింత ఆశ్చర్యం కలిగింది. తోడనే మండోదరి చెప్పిన మాట అతనికి తలపునకు వచ్చింది.

అనంతరం చక్రవేణుని మంత్రి రావణునితో మరల యిలా అన్నాడు– "మా మహారాజు శాసించిన విధంగా మీరు 1.1/4 మణుగు బంగారాన్ని పన్నుగా సమర్పించకపోయినా ఆయనకు యిక్కడకు వచ్చి మీతో యుద్ధం చేయవలసిన పనిలేదు. ఆయనయొక్క ప్రభావ చక్రం తిరుగుతూనే ఉంది. నేను ఒక్కడనే మీ లంకానగరాన్ని నేలమట్టం చేయగలను. ఇప్పుడే మహారాజు చక్రవేణునిమీద ఆన అని ఒక్క త్రోపుతో మీ లంకానగరాన్ని అంతనూ మట్టిలో కలిపివేస్తున్నాను. కాపాడుకోగలిగితే కాపాడుకొండి లేదా మీ నగరరక్షణాన్ని దృష్టిలో ఉంచుకొని మా మహారాజు ఆజ్ఞమేరకు పన్నురూపంలో 1.1/4 మణుగు బంగరాన్ని ఇచ్చి వేయండి కాదంటే యిక మీ నగరం నిలువదు".

మంత్రి పలికిన యీ మాటలు విని రావణుడు తనలో "అయ్యయ్యో! నేను చూస్తుండగా తూర్పుద్వారపు స్థూపాలు, బురుజాలు నేలమట్టం అయిపోయాయి. అవి ధాతునిర్మితములు, సుదృఢములు అయినా నిలువలేదు. వీనిని చూడగా క్షణాలలో లంకానగరాన్ని అంతనూ సర్వనాశనం చేసివేయగలడు అనియే తోస్తుంది" అని తర్కించుకొన్నాడు. ఇక చేయునదిలేక 1.1/4 మణుగు బంగారాన్ని పన్నుగా ఇవ్వడానికి సమ్మతించాడు. ఆ మంత్రిని తన వెంటరమ్మని తోడ్కొనిపోయి అతని కోరికమేరకు పూర్తిగా బంగారాన్ని సమర్పించి పంపివేశాడు.

మంత్రి 1.1/4 మణుగు బంగారాన్ని తీసుకొని చక్రవేణమహారాజు చెంతకు మరలి వచ్చాడు. ఆ బంగారాన్ని మహారాజు రాణీల ముందు ఉంచి ఇదిగో! మీ ఆజ్ఞానుసారం రావణునినుండి పన్నురూపంలో 1.1/4 మణుగు బంగారము తెచ్చానని చెప్పాడు. ఈ బంగారాన్ని ఆ కర్కశాత్మునినుండి ఎలా తేగలిగారని మహారాజు మంత్రిని అడిగేడు. అప్పుడు మంత్రి జరిగిన సంఘటన ఆసాంతము చెప్పి వినిపించాడు.

ఆ విషయం అంతా విని రాణి పరమాశ్చర్యం పొందింది. మంత్రి మాటలతో ఆమె మనస్సు ఎంతగానో ప్రభావితమయింది. ఈ ప్రభావానికి కారణం ఏమిటని ఆమె మహారాజును ప్రశ్నించింది. అప్పుడు మహారాజు ఇలా అన్నాడు – "దేవీ! మనం ఏ విషయములోను పరులమీద ఆధారపడక కష్టపడి వ్యవసాయం చేసుకొంటూ మన పనులను మనం స్వయంగా నిర్వర్తించుకొంటూ వైరాగ్యము, త్యాగబుద్ధి కలిగి జీవననిర్వహణం సాగించుకుంటూ ఉన్నాము. నిష్కామభావముతో ప్రజాధనాన్ని ప్రజాసేవకే వినియోగిస్తున్నాము. స్వప్రయోజనాలకోసం రాజ్యద్రవ్యంనుండి ఒక్క పైస కూడ గ్రహించలేదు. ఈ పవిత్రవర్తనంయొక్క ప్రభావం ఇది.

ఈ మాటలు వినుటతో రాణి మనస్సు మారిపోయింది. అప్పుడు ఆమె భర్తతో ఇలా అంది – "నేను ఇంక బహుమూల్యవస్త్రాభరణాలను అభిలషింపను. ఇంతవరకూ ఎలా సంయమపూర్వకంగానూ, నియమ

పూర్వకంగానూ కాలం గడపుతూ వచ్చానో ఇకమీదటకూడ అలాగే ఉండటానికి నిశ్చయించుకొన్నాను. ఆ క్రమంలో ఇప్పుడెట్టి పరివర్తనాన్ని నేను అపేక్షింపను. ధనిక వ్యాపారుల భార్యలతో సంభవించిన కుసాంగత్యం కారణంగా నా బుద్ధి త్యాగవైరాగ్యాలనుండి, ధర్మంనుండి భ్రష్టం అయిపోయింది. కాని యిప్పుడు ఆ దుస్సాంగత్యప్రభావం నాలో లేదు. అంతరించిపోయింది. నేను మూఢురాలనై బంగారంకోసం పంతగించి మీకు ఇబ్బంది కలిగించాను. అందులకు నన్ను క్షమించండి! ఈ బంగారాన్ని వెనుకకు పంపివేయండి".

రాణి మాటలను ఆలకించి మహారాజు మంత్రితో – మంత్రివర్యా! ఈమె మనసులో ప్రవేశించిన కుసాంగత్యప్రభావం భగవానుని దయవలన శీఘ్రంగానే అంతరించిపోయింది. కాబట్టి యిక మనకు ఈ బంగారంతో పనిలేదు. దీనిని ఎక్కడనుండి తెచ్చారో అక్కడకే మరలించివేయండని చెప్పాడు. అట్లేయని మంత్రి ఆ బంగారాన్ని తీసుకొని మరల లంకానగరానికి పోయి రావణుని కొలువులో ప్రవేశించి "రాక్షసేశ్వరా! ఈ బంగారాన్ని మీకు అప్పగించివేయుమని మా మహారాజుల యాజ్ఞ యైనది. కారణమేమంటే మా మహారాణికి ముందు బహుమూల్య వస్త్రాభరణాలమీద అభిలాష కలిగింది. కాని భగవానుని దయవలన ఇప్పుడు అది సమసిపోయింది. ఇక బంగారంతో వారికి పనిలేదు. కాబట్టి మీది మీరు గ్రహించండి" అని అతనితో చెప్పాడు.

ఆ మాట వినుటతో చక్వవేణుని త్యాగబుద్ధిచేత రావణుని హృదయం మరింతగా ప్రభావితమయింది. అతడు తన బంగారాన్ని తాను స్వీకరించి, మంత్రిని ఆదరించి గౌరవించి వీడ్కొలిపాడు. మంత్రి అచ్చటనుండి మరలి వచ్చి బంగారాన్ని రావణునకు ఇచ్చివచ్చిన సమాచారం మహారాజుకి తెలియజేశాడు. అతని మాటలు విని సమ్రాట్టు, సమ్రాజ్ఞి యిరువురూ పరమానందము పొందారు. ఆ విధంగా చక్వవేణమహారాజుయొక్క ప్రభావం యక్ష, రాక్షస, దేవ, ముని, మనుష్య, పశు, పక్షా ్యదులు అందరియందు, అన్నిటియందు ప్రవర్తిల్లుతుండేది.

ఈ కథవలన మనమెంతో నీతిని గ్రహించవలసి ఉంది. ప్రతి స్త్రీ, ప్రతి పురుషుడు కూడ నిష్కామభావంతో తమతమ వర్ణాశ్రమధర్మాలను అనుసరించి న్యాయంగాను, సత్యనిష్ఠతోను తమ జీవనయాత్ర సాగించుకుంటూ ఉండాలి. పరులమీద ఆధారపడి జీవననిర్వహణం చేయడమెంతో హేయమైన పద్ధతి. దానిని అనుసరింపరాదు. కల్లలాడి, కపటాలు చేసి, విశ్వాసఘాతుకానికి పాల్పడి కూడబెట్టిన ద్రవ్యంవలన ప్రాప్తించినది మృష్టాన్నం అయినా అది విషతుల్యమే అవుతుంది. న్యాయోపార్జితమైన పవిత్రద్రవ్యంవలన ప్రాప్తించిన ఆహారం పిడికెడు సెనగలు మాత్రమే అయినా అమృతతుల్యమవుతుంది. ఒక్క ఆపత్కాలమందు, జబ్బుపడిన పరిస్థితిలోను తప్ప మిగిలిన సమయాలలో సేవకులు, భార్య, బిడ్డలు, శిష్యులు మొదలుగా ఎందరి అంగబలం ఉన్నా సాధ్యమైనంత వరకు మన శరీరసంబంధమైన పనులను మనం స్వయంగా నిర్వర్తించుకుంటు ఉండడం అలవరచుకోవాలి. అలా చేసిననాడు మనం పరులమీద ఆధారపడి జీవించవలసిన దుర్గతి మనకు ప్రాప్తించకుండా ఉంటుంది. మేలును పొందగోరే పురుషునకు పరులపై ఆధారపడి బ్రతుకవలసిన పరిస్థితికంటె లజ్జాజనకం అయిన విషయం వేరొకటిలేదు.

మరొక్క విషయం – మనం కాలాన్ని అమూల్యమయినదిగా గుర్తించి క్షణంకూడ వ్యర్థంకాకుండా గడపుకుంటూ ఉండాలి. అనుక్షణము భగవానుని తలపులో నిలుపుకొని పరోపకారము, శరీరనిర్వహణము మొదలగు పనులు చేసుకొంటూ ఉండాలి. ఆరుగంటల నిద్రాసమయం తప్ప మిగిలిన కాలాన్ని క్షణంకూడ వ్యర్థంచేయకూడదు. దానిని దుర్వినియోగం చేయుట కూడా తగదు. మానవజీవితం బహుమూల్యవంతమయినది. కాబట్టి మనం ఒక్కక్షణం కూడ సోమరితనానికి తావీయరాదు. ఏది మంచిపనియని తోస్తే దానిని ఆచరిస్తూనే ఉండాలి.

క్షణకాలపు దుస్సాంగత్యమయినా మానవునకు తీరని అనర్థాన్ని కలిగిస్తుందనే విషయాన్ని దృష్టిలో ఉంచుకొని నాస్తికులు, నీచులు, ప్రమత్తులు, భోగులు, పాపులు, అకర్మణ్యులు, సోమరులు, పరులమీద

ఆధారపడి జీవించేవారు, బహుమూల్యవస్త్రాభరణాలు దాల్చేవారు, క్రీడావినోదాలతో కాలం గడిపేవారు, మత్తుపదార్థాలను సేవించేవారు, దురభ్యాసాలకు లోబడినవారు అయిన స్త్రీలతోకాని, పురుషులతోకాని క్షణంకూడ సాంగత్యము చేయరాదు. ప్రమత్తత, సోమరితనము, నిద్ర, భయము, ఉద్వేగము, రాగద్వేషాలు, అహంకారము, దురభ్యాసాల వంటి అవలక్షణాలు వీడి మనం మన జీవితాన్ని వివేకము, వైరాగ్యము, త్యాగము, సంయమము, నిష్కామభావము వంటి ఉత్తమలక్షణాలను అవలంబించి భగవద్భజనము, ధ్యానము, సత్సంగము, స్వాధ్యాయము వంటి ప్రక్రియలతో గడపుకొంటూ ఉండాలి. ప్రాణులనన్నిటినీ పరమాత్మ స్వరూపాలుగా భావించి ఆసక్తిని, అహంకారాన్ని వర్జించి వానికి నిష్కామభావంతోను, హృదయపూర్వకంగాను సేవలు చేస్తుండాలి. ఎల్లరయందూ సమభావన, అవ్యాజప్రేమ, దయ గలిగి ఉండాలి.


~~~oOo~~~
~~~

## 2. సర్వభూతహితే రతాః

భగవానుని పొందడానికి ఎన్నో మార్గాలున్నాయి. వాటన్నిటిలో సర్వభూతహితాభిలాష ఉన్నది. ప్రతి ప్రాణియందు భగవానుడు ఉన్నాడు. కావున సమస్తప్రాణులకు హితము, సుఖము చేకూరుస్తూ ఉంటే భగవానుని సేవించినట్లవుతుంది. ప్రాణిలోకంలో ఏ వస్తువు అలభ్యంగా ఉంటుందో దానినే సంపాదించి వానితోనే తనను పూజిస్తే భగవానుడు విశేషంగా ప్రసన్నత చెందుతాడు. ఆ పూజకూడ ఒక్క భగవత్ప్రీతితప్ప మరియే కోరికయు లేక కేవలము నిస్స్వార్థభావంతో సాగించడం జరిగితే అందువలన ఆత్మోద్ధరణము, భగవత్ప్రాప్తి అనాయాసంగా సిద్ధిస్తుంది.

ఎవరి హృదయంలో పరహితాభిలాష ఉంటుందో వారికి లోకంలో దుర్లభమయినదేదీ ఉండదని ఒకచోట తులసీదాసు కూడ చెప్పియున్నాడు. ఒకచోట స్కాందపురాణంలో ఇలా చెప్పబడింది –

శ్లో. పరోపకరణం యేషాం జాగర్తి హృదయే సతామ్ ।
నశ్యంతి విపదస్తేషాం సంపదః స్యుః పదే పదే ॥

శ్లో. తీర్థస్నానైర్న సా శుద్ధిర్బహుదానైర్న తత్ఫలమ్ ।
తపోభిరుగ్రైస్తన్నాప్య ముపకృత్యా యదాప్యతే ॥
(కాశీ. 6/4–5)

ఏ సుజనుల హృదయంలో పరోపకారభావన జాగరూకమై యుంటుందో వారి ఆపదలన్నీ తీరిపోతాయి. అడుగడుగునా సంపదలెన్నో వారికి ప్రాప్తిస్తాయి. అందువలన ప్రాప్తించే పవిత్రత అనేక పుణ్యతీర్థాలలో స్నానం ఆచరించినా ప్రాప్తించదు. అందువలన కలిగే పుణ్యఫలం అధిక దానాలుచేసినా, ఉగ్రతపస్సులు ఆచరించినా కలుగదు.

ఇతరవస్తువుల మాట అటుంచండి! కడకు నిష్కామభావంతో పరోపకారం చేయడంకోసం పాటుపడేవానికి భగవత్ప్రాప్తి కూడ

కలుగుతుందనడంలో సందేహంలేదు. స్వయంగా గీతలో భగవానుడు చెప్పిన మాట యిది –

శ్లో. లభంతే బ్రహ్మనిర్వాణమృషయః క్షీణకల్మషాః ।
ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితే రతాః ॥
(గీత, 5/25)

ఎవరి పాపములు నశించినవో, ఎవరి సకల సంశయాలు జ్ఞానంవల్ల తొలగిపోయినవో, ఎవరు ప్రాణుల హితమునందు తత్పరులై యుందురో ఎవరు మనస్సును జయించి నిశ్చలముగా పరమాత్మలో నిలిచియుందురో, అట్టి బ్రహ్మవేత్తలగు పురుషులు శాంతబ్రహ్మను పొందుచున్నారు.

దీనినిబట్టి పైనచెప్పిన లక్షణాలన్నీ కలిగియుండి పాపరహితులైన ఋషులు సర్వభూతహితరతి కలిగి ఉండడంయొక్క ప్రభావముచేతనే నిర్వాణబ్రహ్మమును పొందుతున్నారు. కాబట్టి మానవుడు సర్వవిధాల స్వార్థాన్ని పరిత్యజించి తన తనువును, మనమును, ధనమును అర్పించి దుఃఖగ్రస్తులు, అనాథలు, ఆతురులు అయినవారికి సేవలు చేయాలి. అనగా అభావంతో బాధపడుతున్న ప్రాణుల దుఃఖాన్ని నివారించి వారికి సుఖం కలిగించడంకోసం మానవుడు తన తనువు, మనస్సు, ధనము సర్వము వినియోగించాలి. తమ జీవనము, తమ సర్వస్వము దీనులు, దుఃఖగ్రస్తులు, అనాథులు, ఆతురపడుచున్నవారు అయిన జనులను సేవించడంకోసమే ఉద్దిష్టమైనదనే భావన ఎవరియందుంటుందో వారు ధన్యజన్ములు, ధన్యజీవనులు అనుట నిజం. ఈ విషయంలో ఒక సుందరమైన కథ ఉంది. అది యెట్లనగా –

పూర్వం జ్ఞానవైరాగ్యసంపద గలిగి ఉన్నతశ్రేణికి చెందిన మహాత్ముడు ఒకడుండేవాడు. అతడు అందరియందు సమదృష్టి కలవాడు. అతని కడకు సత్సంగంలో పాల్గొనడంకోసం గొప్పగొప్ప మహారాజులు మొదలు బహు నిరుపేదలవరకూ అన్ని తరగతుల మనుష్యులు వస్తుండేవారు. వచ్చినవారికందరకు ఆ మహాత్ముడు పైన చెప్పిన

శ్లోకభావాన్నే అవలంబం చేసుకొని సదుపదేశం చేస్తుండేవాడు. కారణమేమంటే అతనిలో ఆ శ్లోకంలో చెప్పిన లక్షణాలన్నీ నిండుగా ఉండేవి. దుఃఖగ్రస్తులూ ఆతురులు అయినవారికి సుఖం కలిగిస్తే భగవత్ప్రాప్తి కలుగుతుందనేది అతని ఉపదేశంలో ప్రధానాంశంగా ఉండేది.

ఇలా ఉండగా ఒకనాడు ఆ నగరాన్ని పాలిస్తున్న మహారాజు ఆ మహాత్ముని సన్నిధికి వచ్చాడు. అతడు మహాత్మునకు పాదాభివందనం చేసి – "మహాత్మా! ఈ యుగంలోకూడ ఎవరికైన భగవత్ప్రాప్తి అనేది కలుగుతుందా? కలుగుతుందని అంటే దానిని పొందడానికి సరళమైన మార్గం ఏది?" అని ఆయనను ప్రశ్నించాడు. అప్పుడా మహాత్ముడు– "పరమాత్ముడు ప్రతిప్రాణియందు ఉన్నాడు. కాబట్టి సమస్తప్రాణులకు నిష్కామభావంతోను మిక్కిలి తత్పరతతోను సేవలు చేస్తుంటే తప్పక భగవత్ప్రాప్తి కలుగుతుంది. ఆ ప్రాణులలో కూడ దుఃఖితులు, అనాథులు, ఆతురులు (ఆరాటపడేవారు) అయినవారికి సేవ చేస్తే శీఘ్రంగా లక్ష్యం సిద్ధిస్తుంది. శుభం చేకూరుతుంది. అని సమాధానం చెప్పాడు. ఆ ఉపదేశాన్ని ఆలకించి మహారాజు స్వస్థానానికి మరలి వెళ్ళాడు. అది మొదలు అతడు ప్రతిప్రాణికి, ముఖ్యంగా దుఃఖగ్రస్తులు, ఆతురులు అయిన వారికి విశేషంగా సేవలు చేయడం మొదలుపెట్టాడు.

ఆ విధముగా ఒక యేడాది గడిచింది. అప్పుడు ఆ మహారాజు మహాత్ముని దగ్గరకు వచ్చి, "ఆర్యా! తమరు చెప్పిన విధంగా నేను ప్రాణులకు నాసేవలను అందిస్తూనే ఉన్నాను. ఈ కార్యక్రమం ఆరంభించి ఇప్పటికి సంవత్సరకాలం అయింది. అయినా నాకు ఇంతవరకు భగవత్ప్రాప్తి కలుగలేదు" అని ఆయనతో చెప్పాడు. అప్పుడు ఆ మహాత్ముడు – "రాజేంద్రా! ఓరిమి వహించు! నిష్కామభావంతోను, ఉత్సాహంతోను కష్టాలలో చిక్కుకొన్నవారికి విశేషంగా సేవలు చేస్తూ ఉండు. అలా చేయగా చేయగా క్రమంగా నీ అంతఃకరణం పరిశుద్ధమై నీకు పరమాత్మప్రాప్తి కలుగుతుందని బదులు పలికాడు. ఆ మాట విని మహారాజు మరల తన గృహమునకు వెడలిపోయాడు. అది మొదలు అతడు పూర్వంకంటే మరింత ఉత్సాహంతో బాధితులకు సేవలు

చేయసాగాడు.

అలా చేస్తూ ఉండగా మరల ఒక సంవత్సరం గడిచింది. అయినా అతనికి భగవత్ప్రాప్తి కలుగలేదు. అప్పుడు అతడు మరల మహాత్ముని కడకు వచ్చి - "మహాత్మా! తమ ఉపదేశానుసారం సేవానుష్ఠానం సాగిస్తూనే ఉన్నాను. నా తనువు, మనము, ధనము, సర్వము విపన్నులసేవకు వినియోగిస్తూనే ఉన్నాను. ఇప్పటికే రాజ్యసంబంధమైన ధనంలో పెద్దమొత్తం పరోపకారంకోసం వ్యయపరచడం జరిగింది. అయినా నాకు భగవానుడు ప్రాప్తించే లక్షణాలేవీ కానరావడంలేదని చెప్పాడు. అప్పుడా మహాత్ముడు మరల ఇలా బదులు చెప్పాడు- "మహారాజా! దృఢవిశ్వాసం కలిగి ఉండు. ఏ విధమైన సందేహము పెట్టుకోవలదు. నీకు విధిగా భగవత్ప్రాప్తి కలుగుతుంది. నీవు బహు చక్కగా, విశుద్ధభావంతో దీనులను, దుఃఖగ్రస్తులను సేవిస్తూ ఉన్నావు. అయినా అనాథలకు, ఆర్తులకు, ఎలాంటి సేవ అందాలో అలాంటిది ఇంతవరకు నీవలన అందింపబడలేదు. అయినా ఈ విధముగానే పరమోల్లాసంతోను, శ్రద్ధతోను నిరంతరంగా సేవాకార్యక్రమం సాగిస్తుంటే ఒకనాటికి నీవలన ఆ విధమైన సేవ అందుతుంది. కాబట్టి నీవు నీ మనస్సును, బుద్ధిని, ఇంద్రియాలను అదుపులో ఉంచుకొని నిస్స్వార్థభావంతో కేవలము భగవత్ప్రీతిని కోరి ఆపన్నులను ఆదుకొని సేవిస్తూ ఉండు.

మహాత్ముడు ఆడిన యీ అమృతమయవచనాలను ఆలకించి ఆ మహారాజు సంతోషించి తన గృహమునకు మరలిపోయి అతని ఆదేశానుసారం మరింత ఉత్సాహంతో సమస్తప్రాణిహితకార్యక్రమంలో నిమగ్నుడయ్యాడు. అతడు ఇప్పుడు దీనులు, దుఃఖగ్రస్తులు, దరిద్రులు, అనాథులు మొదలైన వారి రూపంలో సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే ఉన్నాడన్న భావనతో అందరినీ మరింత భక్తిశ్రద్ధలతో సేవించసాగేడు.

ఇలా ఉండగా ఆ నగరంలోనే ఆపన్నురాలు, అనాథురాలు అయిన ఒక వితంతువుంది. ఆమె ప్రతిదినము అడవికిపోయి ఎండు కట్టెలను

సేకరించి తెచ్చి నగరంలో అమ్ముకొని అందువలన ప్రాప్తించిన అల్పాదాయంతో జీవననిర్వహణం చేస్తుండేది. ఆమెకు ఐదు సంవత్సరముల కొడుకున్నాడు. వానినికూడ ఆ చాలీచాలని ఆదాయంతోనే పోషించుకుంటూ ఉండేది. ఆమె సంపాదనవలన వారికిరువురకూ కడుపులునిండి రోజు గడవడం చాల కష్టంగా ఉండేది. ఆ కారణంగా ఏనాడూ ఆమె దగ్గర ఒక్క పైస మిగిలేది కాదు. ఒకనాడు ఆమె తన బిడ్డను వెంటబెట్టుకొని అడవిలో పుల్లలు సేకరించుటకు పోవసాగింది. మార్గమధ్యంలో ఒక ధనవంతుని బిడ్డ బొంగరము మొదలైన రకరకాల ఆకర్షణీయములైన ఆటవస్తువులతో ఆడుకొంటుండగా ఆ వితంతువు కొడుకు చూచాడు. తనకుకూడ అలాటి ఆటవస్తువులు తెచ్చిమ్మని వాడు తన తల్లిని అర్థించాడు. అప్పుడాతల్లి వానితో – నాయనా! నేను బహుపేదరాలను. నాదగ్గర ధనము లేదు? నేను పుల్లలను అమ్మిడబ్బులు తెచ్చేదానను. ఆ డబ్బులతో కడుపే సరిగా నిండడంలేదు. ఆట బొమ్మలు ఎలా కొనగలను?" అన్నది. ఆ పిల్లవానికి పేద, ధనికుడు అనే భేదం ఏమో తెలియదు. వానికి ఎలాగైన ఆ ఆటవస్తువులు కావాలి. అందులకై పంతగించి నేలమీదపడి దొరలి యేడ్వడం మొదలుపెట్టాడు. తల్లి ఎలాగో వానిని లేవనెత్తి యింటికి తీసుకొని వచ్చింది. ఆమె బిడ్డను ఎన్నో విధాల సమాధానపరచడానికి ప్రయత్నించింది. కాని వాడు శాంతించలేదు. ఆ కారణంగా ఆనాడు ఆమె అడవికి పోలేకపోయింది. ఆ రోజంతా ఉభయులు పస్తుండవలసి వచ్చింది. పిల్లవాడు తన పట్టు విడువలేదు. అలా అవిరామంగా ఏడుస్తూనే ఉన్నాడు. వాని యేడుపును చూడలేక తల్లికూడ ఏడుస్తూ ఉండిపోయింది. ఆమె దగ్గర డబ్బులులేవు. ఆ కారణంగా ఆమె వాని పంతాన్ని చెల్లించలేకపోయింది. అర్ధరాత్రి అయింది. వాతావరణమంతా నిశ్శబ్దంగా ఉంది. అందరూ నిద్రపోతున్నారు. గుడిసెలోపల ఒకమూల పడియుండి తల్లీ బిడ్డ ఏడుస్తున్నారు. పిల్లవాని రోదనధ్వని తారస్థాయిలో ఉంది. రాజభవనం అక్కడకు చేరువలో ఉంది. అందులో నిద్రిస్తున్న మహారాజు చెవులకు పిల్లవాని ఏడుపు వినిపించింది. ఆ ధ్వనిని విని మహారాజు ఉలికిపడి లేచి ఇటు అటు చూడసాగాడు. వెంటనే నగరపాలకుని పిలిచి – "చూడు ఎవరో ఆపన్నుల ఆర్తితో కూడిన రోదనధ్వని వినవస్తున్నది. వెంటనే పోయి దుఃఖించేదెవరో తెలుసుకొని

వారిని ఊరడించి నా దగ్గరకు తీసుకొనిరా! అని అతనిని ఆదేశించాడు. వెంటనే నగరపాలకుడు పోయి ఆ ఏతంతువును పిలిచి ఆమెతో అమ్మా నిన్ను మహారాజు గారు రమ్మంటున్నారు" అన్నాడు. పాపం! కట్టెలు అమ్ముకొని బ్రతికే ఆ స్త్రీ నగరపాలకుని చూచి భయకంపితురాలై - "అయ్యా! చంటిపిల్లవాడు బాబూ! ఏడుస్తున్నాడు. వీని అపరాధం క్షమించండి నాయనా!" అని దీనంగా అతనిని ప్రార్థించింది. "భయపడకు తల్లీ! నా వెంటరా! దయతలచే మహారాజు నిన్ను తీసుకొని రమ్మన్నారు" అని అతడు ఆమెకు ధైర్యం చెప్పాడు. అయినా ఆమెకు భయం తీరలేదు. ఆమె తనలో పిల్లవాని యేడ్పు కారణంగా మహారాజుకి నిద్రాభంగం అయింది. అందులకు ఆయన దండన విధింపక మానరు. ఆయన రమ్మని పిలిపించినప్పుడు వెళ్ళక తీరుతుందా అని అనుకొన్నది. ఆమె నగరపాలకుని అనుసరించింది. అతని మాటలతో ఆమె యేడ్వడం మానివేసింది. కాని భయంతో ఆమె శరీరం కంపిస్తూనే ఉంది. పిల్లవాడు ఏడుస్తూనే తల్లిని అనుసరించి నడుస్తున్నాడు.

క్రమంగా తల్లిబిడ్డలిరువురూ నగరపాలకుని వెంట రాజభవనంలో ప్రవేశించారు. అప్పుడు మహారాజు పోరుపెట్టి యేడుస్తున్న పిల్లవానిని, భయంతో కంపిస్తున్న వాని తల్లిని చూచి, "అమ్మా! భయపడక చెప్పు. పిల్లవాడు ఎందులకు ఏడుస్తున్నాడు? వాని యేడ్పునకు కారణం ఏమి? నేను తెలుసుకొనగోరుతున్నాను" అని ప్రశ్నించాడు. అప్పుడు ఆమె యిలా బదులు చెప్పింది - "మహాప్రభూ! నేను అడవిలో ఎండుపుల్లలను సేకరించి తెచ్చి అమ్ముకొని జీవించే పేదరాలను. ఈనాడు నేను పుల్లలకోసం అడవికి పోవుచుండగా దారిలో ఒక ధనవంతుల పిల్లవాడు బొంగరము మొదలైన రకరకాల ఆటవస్తువులతో ఆడుకొంటూ వీని కంటబడ్డాడు. అప్పటినుండి ఆ వస్తువులు తనకు కావాలని పంతగించి యేడ్వడం మొదలుపెట్టాడు. ఎన్ని విధాల ప్రయత్నించినా శాంతించడంలేదు. వీని మారాము కారణంగా నేను ఈ రోజున అడవికి పోలేకపోయాను. ఆకారణంగా వీడు ఆకలితో కూడ మాడుతున్నాడు. సగంరాత్రి గడచింది. అయినా ఊరకుండక ఏడుస్తూనే ఉన్నాడు. నేను ఎన్నో విధాల వీనిని సమాధానపరచడానికి ప్రయత్నం చేస్తూనే ఉన్నాను. అయినా

శాంతించడం లేదు. ఏమి చేయగలను? చిన్న పిల్లవాడు జ్ఞానంలేనివాడు.

ఆమె మాటలు విని వెంటనే మహారాజు తన భవనంలోపలనుండి పూరీ, కూర, మిఠాయి తెప్పించి ఆమె చేతికిచ్చారు. ఇప్పుడే ఆటవస్తువులు తెప్పిస్తున్నాను అని ఆమెతో చెప్పారు. ఆమె ఆ పదార్థాలను పిల్లవానికి తినిపించుటకు ఎంతో ప్రయత్నించింది. అయినా ఆ పిల్లవాడు తన కోరిక తీరని కారణంగా ఏమీ తినలేదు. పిల్లవాడు తినకుంటే తల్లి మాత్రం ఏమి తింటుంది? అప్పుడు మహారాజు నగరపాలకుని వంకకు తిరిగి – "ఓయీ! నీవు వెంటనే బజారునకు పోయి ఈ పిల్లవాడుకోరే ఆటవస్తువులను ఒక బుట్టెడు తీసుకొనిరమ్ము" అని అతనిని ఆజ్ఞాపించాడు. కర్తవ్యపరాయణుడైన నగరపాలకుడు వెంటనే బజారునకు పోయి దుకాణదారును మేలుకొల్పి అప్పుడే వానిచేత కొట్టుతెరపించి రాజాజ్ఞను వానికి ఎరిగించి బుట్టెడు ఆటవస్తువులను వానినుండి గ్రహించాడు. వానికి మూల్యం చెల్లించి ఆ బుట్టను తెచ్చి మహారాజు ముందు ఉంచాడు. ఆ ఆటవస్తువులను అన్నిటినీ మహారాజు ఆ పిల్లవానికి ఇచ్చి వేసేడు. పిల్లవాడు తన రెండు చేతులతోనూ గ్రహించగలిగినన్ని వస్తువులను గ్రహించి నవ్వుతూ గంతులు వేయడం మొదలుపెట్టాడు. పిల్లవాని సంతోషాన్ని చూచి తల్లి మిక్కిలి ఆనందించింది.

అనంతరం మహారాజు వారికిరువురకు కడుపునిండా భోజనంపెట్టి తృప్తి గలిగించి మిగిలిన భోజనసామగ్రిని, ఆటవస్తువులను కూడ ఆ తల్లికి అర్పించాడు. తల్లి, బిడ్డ ప్రసన్నహృదయాలతో తమ కుటీరానికి మరలిపోయారు. మహారాజునుండి సెలవుగైకొని నగరపాలకుడు కూడ తన స్థానానికి తిరిగి పోయాడు. ఆ సమయమందే మహారాజునకు విజ్ఞానానందఘనుడైన పరమాత్ముని స్వరూపం గోచరించింది. అప్పుడు మహారాజుయొక్క ఆనందానికి, శాంతికి అవధులులేక పోయాయి.

ఆ రేయి గడచితెల్లవారిన వెంటనే మహారాజు తన గురువైన మహాత్ముని సన్నిధికి వెళ్లి దండప్రణామములాచరించి తనకు కలిగిన అనుభవాన్ని అంతనూ ఆసాంతముగా ఆయనకు తెలియజెప్పాడు.

అప్పుడు మహాత్ముడు మహారాజుతో - "రాజేంద్రా! నీవు ఎందరికో సేవలు చేశావు. పరోపకారం కోసం ఎంతో ధనాన్ని వెచ్చించావు. కాని యీనాడు నీవలన సంభవమయిన సేవ ఇంతకు ముందెన్నడూ సంభవం కాలేదు" అని అన్నాడు. మహాత్ముని మాటలు విని మహారాజు పరమానందభరితుడై తన గృహమునకు మరలి పోయేడు.

ఆ నగరానికి రెండు కోసుల దూరంలో బహు నిరుపేదయైన గ్రామీణుడు ఒకడుండెను. అతడు వీధులలో తిరిగి మిఠాయి మొదలైన తినుబండారములను అమ్ముకొని జీవించే వ్యక్తి. మహారాజు తన అనుభవాన్ని మహాత్మునకు తెలియజేస్తున్న సమయంలో ఆ వ్యాపారి కూడ అక్కడే ఉండి ఆ ప్రసంగాన్ని ఎంతో ఆసక్తితో ఆలకించాడు. అప్పుడతడు, "ఆర్యా! నావంటి పేదవానికి కూడ భగవానుడు లభిస్తాడంటారా?" అని ఆ మహాత్ముని ప్రశ్నించాడు. ఎందుకు లభించడు? భగవానునకు పేదవాడు, ధనికుడు అన్న భేదం ఉండదు. ఆ స్వామి ఆర్తితో ఉన్నవారికి లభ్యుడు. ఒక పర్యాయం చోళుడనే మహారాజుకి, విష్ణుదాసుడనే బ్రాహ్మణునకూ భక్తిపరంగా భగవద్దర్శనం విషయంలో స్పర్థ (పోటీ) సంభవించింది. అందు విష్ణుదాసుడనే ఆ బీదబ్రాహ్మణుడే విజయం పొందాడు. అతనికే ముందుగా భగవద్దర్శనం ప్రాప్తించింది. అని మహాత్ముడు బదులు చెప్పాడు.

ఆ మాటలు విని వ్యాపారి - "మహాత్మా! ఆ చోళరాజు ఎవరు? ఆ బీద విష్ణుదాసుడెవరు? వారి నడుమ స్పర్థ యెట్లు సంభవించింది? ఆ బీద బ్రాహ్మణునకు మహారాజుకంటె ముందుగా భగవద్దర్శనం ఎలా ప్రాప్తించింది? దయచేసి యీ విషయమంతా నాకు సవిస్తరంగా వినిపించగోరుదును" అని ఆయనను అడిగాడు.

అంతట మహాత్ముడు ఇలా చెప్పడం మొదలుపెట్టాడు - "నాయనా! పూర్వం చోళుడనే చక్రవర్తి ఉండేవాడు. అతడు కాంచీపురవాసి. అతని అధీనములైయున్న దేశాలన్నీ చోళదేశాలు అనబడ్డాయి. ఆ చోళరాజు రాజ్యంలో దరిద్రులు, దుఃఖగ్రస్తులు, పాపవర్తనులు, వ్యాధిపీడితులు ఒక్కరూ ఉండేవారు కారు.

అతడు అసంఖ్యాకంగా యజ్ఞాలు చేసినవాడు.

ఒకనాడు ఆ చోళమహారాజు "అనంతశయనం" అనే క్షేత్రానికి వెళ్ళాడు. అక్కడ జగదీశ్వరుడైన శ్రీహరి శేషశయనుని రూపంలో విరాజిల్లుతూ ఉంటాడు. ఆ స్వామియొక్క దివ్య విగ్రహాన్ని మహారాజు యథావిధిగా పూజించాడు. అతడు బంగారు పూలతోను, ముత్యాలతోను, మణులతోను తృప్తిగా పూజచేసి స్వామికి సాష్టాంగనమస్కారం గావించాడు. ఈ విధముగా తన పూజాకార్యక్రమం పూర్తి చేసుకొని అతడు కూర్చుండునంతలో ఆ గ్రామంలోనే నివసిస్తున్న విష్ణుదాసుడనే బ్రాహ్మణుడు ఆ స్వామిని పూజించుటకై చేత జలమును, తులసీదళాలను గ్రహించి అక్కడకు వచ్చాడు. ఆ బ్రహ్మర్షి విష్ణుసూక్తం పఠిస్తూ తులసీదళాలతో యథాపూర్వకముగా భక్తితో ఆ స్వామికి పూజ చేసేడు. ముందు మహారాజు అర్పించిన బంగారు పుష్పాలు, మణులు మొదలైనవన్నీ తులసీమంజరులతో ఆచ్ఛాదితములు అయిపోయాయి. అది చూచి మహారాజు కుపితుడయ్యాడు. విష్ణుదాసా! నేను సమర్పించిన మణులతోను, సువర్ణపుష్పాలతోను ముందు స్వామియొక్క మూర్తి ఎంత అందమొలికిస్తూ ఉన్నది? నీవు వచ్చి వానిమీద తులసీదళాలు ఉంచి ఆ అందాన్ని అంతనూ హరించివేశావు. అలా ఎందుకు చేశావు? నీవు పరమమూర్ఖుడవుగా కానవస్తున్నావు. నీకు విష్ణుభక్తి అంటే ఏమో తెలియదు. అందుచేతనే ఎంతో చక్కగా అలంకరించిన సువర్ణాన్ని పైకి కానరాకుండా తులసీదళాలతో కప్పివేశావు. నీ ప్రవర్తన చూడగా నాకు ఎంతో అసంతుష్టి కలుగుతూ ఉంది అని అతనిని ఉద్దేశించి తిరస్కారవచనాలు పలికాడు.

ఆ మాటలు విని విష్ణుదాసుడు – "రాజేంద్రా! భక్తి అంటే ఏమో మీకు ఈషణ్మాత్రము తెలియదు. కేవలము రాజ్యలక్ష్మిని చూచుకొని మీరు గర్వపడుతున్నారు. మీరే చెప్పండి. ఇంతకు ముందు మీరెన్ని వైష్ణవవ్రతాలను పాటించారు" అని ప్రతివాదం చేశాడు.

అప్పుడు మరల మహారాజు ఇలా అన్నాడు – "ఓ బ్రాహ్మణుడా!

విష్ణుభక్తుడననే గర్వంతో ఇచ్చవచ్చిన విధంగా మాటలాడుతున్నావు. నీలో ఉన్న భక్తి యేపాటిది? నీవు దరిద్రుడవు, నిర్ధనుడవు. నీవు శ్రీమహావిష్ణువునకు ప్రసన్నత కలిగించే యజ్ఞాలు, దానాలవంటి పుణ్యకార్యాలను ఏనాడైన ఆచరించి యెరుగుదువా? ఇంతకుముందు ఎక్కడైన ఒక దేవాలయమైనా నిర్మింపజేశావా? ఏమీ చేయకుండానే అంత అహంకారము నీకేల? సరియే. కానిమ్ము. ఇప్పుడు ఇక్కడ చేరియున్న బ్రాహ్మణోత్తములారా! మీరు ఎల్లరూ నా మాట వినండి. ఇతనికంటెను ముందు నేనే శ్రీమహావిష్ణుదేవుని దర్శనం పొందుతానో, నాకంటె ముందు ఇతడే పొందుతాడో? మీరే చూడండి! నా భక్తి ఎంతటిదో, ఇతని భక్తి యెంతటిదో స్వయంగా మీకే తెలియవస్తుంది.

ఈ విధముగా పలికి చోళుడు తన రాజభవనానికి తిరిగి వెళ్ళిపోయాడు. ముద్గలమహర్షిని ఆచార్యుని గావించుకొని ఆయన సారథ్యంలో వైష్ణవయాగం అనుష్ఠింప మొదలుపెట్టాడు. అందు ఎందరో మహర్షులు పాల్గొన్నారు. ఎంతయో అన్నదానం చేయబడింది. బ్రాహ్మణులకు భూరి దక్షిణలు సమర్పింపబడినాయి.

అక్కడ విష్ణుదాసుడు కూడ ఆ భగవానుని మందిరమందే నిలిచిపోయి శ్రీమహావిష్ణువునకు ప్రసన్నత గలిగించునట్టి శాస్త్రోక్తనియమాలనన్నిటినీ చక్కగా పాటిస్తూ నిరంతరంగా వ్రతానుష్ఠానం చేయడం మొదలుపెట్టాడు. మాఘమాసవ్రతపాలనము, కార్తీక వ్రతపాలనము, తులసీవనపోషణము, ఏకాదశీవ్రతపాలనము, "ఓమ్ నమో భగవతే వాసుదేవాయ" అనే ద్వాదశాక్షరమంత్రజపము, గీతనృత్యవాద్యాలతోడ మంగళప్రదమైన ఉత్సవనిర్వహణము, ప్రతిదినము షోడశోపచారవిధులతో శ్రీమహావిష్ణుపూజనము, వీనితో అతని జీవనచర్య సాగడం మొదలయింది. అతడు నడుస్తున్నా, కూర్చున్నా, తింటున్నా, త్రాగుతున్నా, మేలుకొన్నవేళ, నిద్రపోయేవేళ నిరంతరము శ్రీమహావిష్ణువును స్మరిస్తూనే కాలం వెళ్ళబుచ్చుతున్నాడు. అతడు సమదృష్టికలవాడు, సమస్తప్రాణులయందూ భగవానుడైన శ్రీమహావిష్ణువు ఉన్నట్లు భావించేవాడు. చూచేవాడు. భగవానుని ప్రసన్నతను కోరి అతడు

ఉద్యాపనవిధులతోడ మాఘమాసనియమాలను, కార్తీకమాసనియమాలను అవిరామంగా పాటించాడు.

ఈ విధముగా అక్కడ చోళమహారాజు, ఇక్కడ విష్ణుదాసుడు ఇరువురూ పరస్పరము స్పర్ధవహించి శ్రీమహావిష్ణువుని ఆరాధిస్తూ ఉన్నారు. ఇరువురూ సడలని వ్రతనిష్ఠ వహించి యున్నారు. ఇరువురి ఇంద్రియాలు, కర్మలు సర్వము భగవానుని మీద కేంద్రీకృతములై ఉన్నాయి.

ఇట్లుండగా ఒకనాడు విష్ణుదాసుడు నిత్యకర్మానుష్ఠానం పూర్తియైన మీదట భోజనం సిద్ధపరచాడు. అంతలో అతనిని ఏమరజేసి ఎవరో ఆ యన్నమును అపహరించారు. హరించినవాడు ఎవరికీ కానరాలేదు. విష్ణుదాసుడు ఇక ఆనాడు మరల రెండవసారి వంట చేయలేదు. చేస్తే సాయంకాలపు పూజకు అవకాశం ఉండడంలేదు. నిత్య నియమానికి భంగం వాటిల్లుతుందన్న భయం కలిగింది. మరునాడు ఆ వేళకే భోజనం సిద్ధంచేసి అతడు భగవానునకు నైవేద్యం అర్పించబోయాడు. ఆనాడు కూడ అతనికి తెలియకుండ ఎవరో వచ్చి మరలా ఆ అన్నాన్ని హరించుకొనిపోయారు. ఈ విధముగా ఏడు దినములవరకు ఎవరో గుప్తంగా వచ్చి నిత్యము అన్నాన్ని ఎత్తుకొని పోతూనే ఉన్నారు. అందువలన విష్ణుదాసునకు ఎంతో విస్మయం కలిగింది. అతడు తనలో ఇలా తర్కించుకోవడం మొదలుపెట్టాడు. అహో! ఇదేమి విచిత్రం? దినదినము నా వంటను ఎవరు హరిస్తున్నారు? నేను క్షేత్రసన్యాసం స్వీకరించినవాడను. ఈ ప్రదేశాన్ని వీడి మరియొక దిక్కునకు పోవవీలులేదు. రెండవమారు వంటచేస్తే సాయంకాలపు పూజకు సమయం ఉండదు. సామగ్రిని అంతనూ భగవానునకు నివేదనం చేసేవరకు నేను భోజనం చేయవీలులేదు. ప్రతిదినము ఉపవాసం చేస్తుంటే యీ వ్రతం ముగిసేవరకు జీవించలేను. మరి యిప్పుడు నేను ఏమి చేయాలి? ఆ! ఒక పని చేస్తాను. ఈనాడు నైవేద్యం పెట్టిన అన్నం మీద దృష్టిసారిస్తాను

ఈ విధముగా ఆలోచించుకొని వంటపని ముగిసిన పిమ్మట

అతడచ్చటనే ఒకచోట దాగియుండి ఆ పదార్థం మీదనే దృష్టినుంచి పరిశీలించసాగాడు. ఇంతలో ఒక చండాలుడు పదార్థాన్ని హరించడానికి ఉద్యమిస్తూ అతని కంటబడ్డాడు. అతని శరీరం బహుదుర్బలంగా ఉంది. ముఖంలో దీనత్వం ఉట్టిపడుతూ ఉంది. శరీరంలో ఎముకలు, చర్మము తప్ప వేరేమీ లేదు. అతడు ఆకలితో నకనకలాడుతూ ఉన్నట్లుకానవస్తున్నాడు. వానినిగాంచి విష్ణుదాసుని హృదయం కరుణతో ద్రవించిపోయింది. అతడు ముందునకు వచ్చి – "సోదరా! ఒకింత నిలువుము, నిలువుము ఆవట్టి యన్నమును ఎట్లు భుజింతువు? ఇదిగో! ఈ నెయ్యి తీసుకొనుము అని ఆ చండాలుని పలుకరించాడు. తనను సమీపిస్తున్న విష్ణుదాసుని చూచి చండాలుడు వేగంగా పారిపోవుటకు యత్నించి భయకంపితుడై నేలమీద పడి మూర్ఛపొందాడు. విష్ణుదాసుడు వెంటనే అతనిని సమీపించి తన ఉత్తరీయంతో వానికి వీవన వీయమొదలుపెట్టాడు. అనంతరం ఆ చండాలుడు మెల్లగా లేచి నిలిచాడు. కాని విష్ణుదాసునకు అతడు చండాలుడుగా కానరాలేదు. వానికి బదులుగా శంఖచక్రగదా పద్మపాణియై సాక్షాత్తు శ్రీమన్నారాయణుడు నిలిచియున్నాడు. ఆ సమయమున ఆ స్వామి చతుర్బాహువులతో, కటితటమున కమనీయ పీతాంబరంతో శిరమున సువర్ణరత్నమయకిరీటంతో, హృదయప్రదేశమున సిరులొలుకు శ్రీవత్సచిహ్నంతో, అతసీకుసుమంవలె (అవిసె పుష్పము) శ్యామసుందరచ్ఛాయను వెలిబెట్టు కోమలశరీరంతో, వెడద యెడదపై ధగధగలాడు మనోహర కౌస్తుభరత్నంతో సూర్యప్రభాభాసమానుడై తేజరిల్లుతూ ఉన్నాడు. తన పరమారాధ్య దైవాన్ని ఆ విధముగా ప్రత్యక్షంగా చూడడంతో విష్ణుదాసునినందు దేహము రోమాంచము, (ఒడలు పులకరించుట) కన్నుల ప్రేమాశ్రుపాతము మొదలైన సాత్త్వికభావాలు ఆవిర్భవించాయి. భావోద్వేగం కారణంగా అతడు స్వామికి స్తుతికాని, నమస్కారంకాని చేయలేకపోయాడు. ఆ సమయంలో అక్కడ ఇంద్రాదిదేవతలు, మహర్షులు ప్రత్యక్షమయ్యారు. సాత్త్వికవ్రతపాలనం చేసినవాడగు విష్ణుదాసుని విష్ణుదేవుడు తన అక్కున జేర్చుకొని గాఢముగా కౌగిలించుకొని అతనికి తనతో సమానమైన రూపమును ఒసగి అతనిని తన వెంట వైకుంఠానికి తీసుకొని పోవసాగాడు.

ఒక సుందరమైన విమానాన్ని అధిరోహించి భగవానుని ధామమైన వైకుంఠానికి వెడలిపోతున్న ఆ విష్ణుదాసుని ఆ సమయములో యజ్ఞదీక్ష వహించియున్న చోళరాజు చూచాడు. వెంటనే అతడు తన గురువైన ముద్గలమహర్షిని పిలిచి ఆయనకు ఆ విష్ణుదాసును చూపుతూ – గురువర్యా! అదిగో! విష్ణుదాసుడు, విష్ణురూపము దాల్చి నాకంటె ముందు వైకుంఠానికి వెడలిపోతున్నాడు. అతనితోనే పోటీపడి నేను ఈ యజ్ఞదానాది విధులను ఆచరిస్తున్నాను. నేను ఈ వైష్ణవయాగంలో దీక్ష వహించి చక్కగా హోమాలు చేశాను. దానాదులు చేసి బ్రాహ్మణుల కోరికలను తీర్చాను. అయినా భగవానునకు నామీద ప్రసన్నత కలుగలేదు. ఈ విష్ణుదాసునకు కేవలము భక్తి కారణంగానే ప్రసన్నతచెంది భగవానుడు ప్రత్యక్షంగా దర్శనమిచ్చాడు. కాబట్టి భగవానుడు యజ్ఞదానాది విధులవలన ప్రసన్నుడు కాడు. కేవలము ఒక్క భక్తిచేతనే ప్రసన్నుడై దర్శనం ఇస్తాడని తేటతెల్లమవుతోంది" అని పలికాడు.

చోళుడు చిన్ననాటినుండి కూడ యజ్ఞదీక్ష వహించి అందే నిమగ్నుడై ఉండేవాడు. ఆ కారణంగా అతనికి పుత్రసంతానం కలుగలేదు. అందుచేత అతడు తన రాజ్యానికి వారసునిగా తన మేనల్లుని పట్టాభిషిక్తుని చేశాడు. అనంతరమతడు యజ్ఞశాలలోనికి అరిగి యజ్ఞకుండం ముందు నిలిచి శ్రీమహావిష్ణువును సంబోధించి – స్వామీ! విష్ణుదేవా! నాకు మనోవాక్కాయకర్మల ద్వారా మీపై ఆచంచలమైన భక్తిని ప్రసాదించండి అని ముమ్మారు పలికి యెల్లరు చూస్తుండగా అగ్నిలోనికి దుమికాడు. తోడనే భక్తవత్సలుడైన భగవానుడు ప్రత్యక్షమై ఆ మహారాజును అక్కునజేర్చి కౌగిలించుకొని సుందరవిమానాన్ని అధిరోహింపజేశాడు. అతనికికూడ తనతో సమానమైన రూపాన్నిచ్చి దేవతాబృందాలు వెంబడింపగా ఆ దేవదేవుడు వైకుంఠమునకు వెడలిపోయాడు. (ఈ కథ పద్మపురాణం, ఉత్తరఖండం 110–111 అధ్యాయములలో వర్ణింపబడి యున్నది)

ఈ కథను ఆలకించి వీధులలో తిరిగి సరకులు అమ్ముకొనే వ్యాపారికి చాల సంతోషం కలిగింది. అప్పుడాతడు – "మహాత్మా! నావంటి

అకించనుడైన వానికి శీఘ్రంగా భగవద్దర్శనం కావాలంటే నేను ఏమి చేయాలి?" అని మహాత్ముని ప్రశ్నించాడు. అప్పుడు మహాత్ముడు ఇలా అన్నాడు – "నాయనా! భగవానుడు సమస్తప్రాణులలోను నిండి ఉన్నాడని యెరిగి నీవు నీ కర్మలద్వారా యెల్లరకూ సేవలు చేస్తుండు" భగవానుడు గీతలో ఇట్లు చెప్పియున్నాడు –

శ్లో. యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్ ।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః ॥
(గీత. 18/46)

ఏ పరమేశ్వరునిచే సర్వప్రాణుల యుత్పత్తి జరిగెనో, ఎవరిచే ఈ సర్వజగత్తు వ్యాప్తమైయున్నదో ఆ పరమేశ్వరుని తమ స్వాభావిక కర్మలద్వారా పూజించి మానవులు పరమసిద్ధిని పొందుచున్నారని పై శ్లోకభావం.

మహాత్ముని యీ ఆదేశమునాలకించి వ్యాపారి తన గ్రామానికి మరలిపోయాడు. అది మొదలు అతడు మహాత్ముని ఆదేశానుసారం సాధన చేయడం మొదలుపెట్టాడు. అతడు ప్రతిదినము వీధులలో తిరిగి చేసే వ్యాపారంమూలంగా రెండు రూపాయలు సంపాదించేవాడు. అందులో రూపాయి ఏబదిపైసలను తన కుటుంబపోషణకోసం వెచ్చించుకొని మిగిలిన ఏబది పైసల ద్రవ్యాన్ని ఆపన్నులు, అనాథలు, అసహాయులు, ఆతురుల క్షుధార్తులు అయినవారి సేవకు వినియోగిస్తుండేవాడు.

అతడా విధముగా సేవలు చేస్తుండగా మూడు ఏండ్ల కాలం గడిచింది. అయినా అతనికి భగవానుడు ప్రాప్తించే సూచనలు ఏవీ కానరాలేదు. అంతట ఒకనాడతడు మహాత్ముని సన్నిధికరిగి ఆయనతో ఇట్లన్నాడు – "మహాత్మా! నేను నిత్యము రెండు రూపాయలు సంపాదిస్తుంటాను. అందు ఒక రూపాయి ఏబది పైసలు నా కుటుంబపోషణకోసం వినియోగించి మిగిలిన పైసలను నిత్యము దీనులసేవకు వెచ్చిస్తున్నాను. కాని యింతవరకు నాకు భగవత్ప్రాప్తి

లక్షణాలు కానరావడము లేదు. మీరే చెప్పండి నన్ను ఏమి చేయమంటారు? నాకు శీఘ్రంగా భగవద్దర్శనం కావాలి" అన్నాడు. వ్యాపారి పలికిన యీ మాటలను విని మహాత్ముడు – "ఓయీ! నీవు చేయుచున్న సాధన విధం మేలైనది. మరింత ఉత్సాహంతోను, ఉల్లాసంతోను, విశ్వాసపూర్వకంగా అలాగే పేదలు, దీనులు, దుఃఖితులు, ఆర్తులు, దరిద్రులు అయినవారిని నారాయణరూపులుగా భావించి ఇతోధికంగా సేవిస్తుండు" అని బదులు చెప్పెను. అట్లేయని వ్యాపారి తన స్థానానికి తిరిగి వెడలిపోయాడు. మహాత్ముని ఆజ్ఞానుసారం మరింత ఉత్సాహంతో ఆపన్నులకు సేవలను అందించసాగాడు.

ఇలా ఉండగా ఆ పట్టణంలోనే ఒక గుడిసె నిర్మించుకొని ఒక కట్టెలను అమ్ముకొనేవాడు నివసిస్తున్నాడు. అతడు అడవినుండి ఎండుకట్టెలు తెచ్చి అమ్ముకొని తన్మూలంగా లభించిన అల్పద్రవ్యంతో అతికష్టంగా జీవననిర్వహణం సాగిస్తున్నాడు. ఒకనాడతనికి అడవిలో దగ్గరలో కట్టెలు ఏవీ దొరకలేదు. వానికై అతడు మరింత దూరం పోవవలసివచ్చింది. ఆ కారణంగా మరలి వచ్చుటలో అతనికి ఆలస్యమైంది. అతడు కట్టెలమోపు గ్రహించి మరలి వచ్చునప్పటికి పగలు పన్నెండు గంటల వేళ అయింది. గ్రీష్మ తాపముచే అతని శరీరం చెమటతో ముద్దముద్ద అయినట్లుంది. ఇంకను అతనికి నగరం ఒక మైలుదూరంలో ఉంది. అప్పుడు కడుపులో వికారము, తల తిరగడమూ మొదలై అతడు సొమ్మసిల్లి (మూర్ఛితుడై) క్రింద పడిపోయాడు. కట్టెలమోపు అతనికి ప్రక్కగా పడిపోయింది. అతడు స్పృహకోల్పోయాడు.

ఆ సమయములోనే వీధులలో తిరిగే వ్యాపారి తన గ్రామమునుండి నగరం దిక్కుగా పోతున్నాడు. త్రోవలో మూర్ఛిల్లిన కట్టెలవానిని చూచి అతనికి అతనిపై జాలి కలిగింది. ఆ వ్యాపారి దగ్గర ఉడుకపెట్టబడిన సెనగలు, మంచినీరు ఉన్నాయి. అతడు వెంటనే ఒక దోసెడు నీరు కట్టెలవాని ముఖం మీద చల్లాడు. తన వస్త్రంతో వానికి గాలి తగులునట్లుగా విసిరి వానిసేదతీర్చాడు. అంతట కట్టెలవాడు తెప్పరిల్లి కన్నులు తెరచి స్పృహలోనికవచ్చి లేచి కూర్చున్నాడు. వ్యాపారి అతనిని

చేరువగా ఉన్న చెట్టునీడకు గొనిపోయి అతడు బహునిరుపేద, విపన్నుడు, క్షుధార్తుడు అని గుర్తించి వానికి తృప్తి గలుగునంతమేరకు సెనగలు తినిపించి మంచినీటిని త్రాగించాడు. అంతట అతని ఆత్మ ఎంతో సంతృప్తిని పొందింది. అతడు తన కష్టగాథను అంతను వ్యాపారితో చెప్పుకున్నాడు. అటుపిమ్మట ఆ వ్యాపారికి కృతజ్ఞత తెల్పుకొని వినయవచనాలతో అతనిని స్తుతించడం మొదలుపెట్టాడు. అప్పుడు వ్యాపారి అతనిని – "సోదరా! నేను స్తుతిపాత్రుడను గాను. భగవానుడు స్తుతిపాత్రుడు. ఈ ఉన్నదంతా భగవానునిదే. నేను నిమిత్తమాత్రుడను. నీవు నన్ను కాదు, భగవానుని స్తుతించాలి. నేను చేయదగిన సేవ ఏదయినా ఉంటే చెప్పు. సంతోషముగా చేస్తాను" అన్నాడు. అప్పుడు కట్టెలవాడు– "అయ్యా! ఇప్పుడు నాలో ఓపిక చేరింది. నాకు బాధ యేదీ లేదు. ఈ కట్టెలమోపును నా తలమీదకు ఎత్తితే నేను నగరంలోనికి పోతాను" అని మారు పలికాడు. వ్యాపారి మోపును వాని తలమీదకు ఎత్తాడు. అంతట కట్టెలవాడు నగరం దిక్కుగా వెళ్ళిపోయాడు.

అటుపిమ్మట వ్యాపారి తన జంగిడిని (అమ్మకపుసరకులు పెట్టుకొనే బుట్ట) మంచినీటిపాత్రను గ్రహించి నగరంవైపు సాగిపోవుటకు ఉద్యమించునంతలో అతనిముందు భగవానుడు ప్రత్యక్షమయ్యాడు. ఆ స్వామిని దర్శించుటతోడనే అతనికి ఒడలు పులకరించింది. నేత్రముల ప్రేమాశ్రుధారలు జాలువారినవి. అతని ఆనందానికి, శాంతికి అంతు లేకపోయినది. అప్పుడు భగవానుడు – "నాయనా! దీనులు, దుఃఖితుల రూపంలో ఉన్న నాకు, నీవు అందించిన సేవలతో సంతృప్తి కలిగినది. ఇప్పుడు నీకు ఏమి వరం కావలెనో కోరుకో! ఇస్తున్నాను అని అతనిని పలుకరించాడు. ప్రభూ! ఈనాడు మీరు నాకు దర్శనమొసగి నన్ను కృతకృత్యుని గావించారు. ఇంతకంటె ఇక నాకు ఏమి కావలయును? అని వ్యాపారి బదులు చెప్పెను. అయినా ఏమైనా కోరుకొమ్మని భగవానుడు మరల అన్నాడు. మీయందు నాకు ఎల్లవేళలా నిర్మలమైన ప్రేమ నెలకొని ఉండునట్లు నన్ను అనుగ్రహించండి స్వామీ" అన్నాడు వ్యాపారి. అంతట "తథాస్తు" అని పలికి భగవానుడు అంతర్ధానం చెందాడు.

అప్పుడా వ్యాపారి ప్రేమానందనిమగ్నుడై తన గురువైన మహాత్ముని సన్నిధికి వచ్చాడు. ఆయన పాదాలకు సాష్టాంగంగా ప్రణమిల్లాడు. తనకు కలిగిన భగవద్దర్శనానందానుభవాన్ని ఆసాంతముగా వివరించి చెప్పాడు. అప్పుడు మహాత్ముడు అతనితో ఇలా అన్నాడు– "నాయనా! దరిద్రుడు, దుఃఖగ్రస్తుడు, పేదవాడు అయిన కట్టెలవానికి నీవు సెనగలు తినిపించి మంచినీరు త్రాగించి అతనికి సేద తీర్చడం అనేది ఉత్తమమైన సేవావిధానము. అంతకుముందు చేసిన సేవాకార్యాలకన్న ఇది మిన్నయైనది. ఆ మాటలువిని వ్యాపారి పరమానందభరితుడై ఆయనకు పునర్నమస్కారం చేసి స్వగృహానికి మరలిపోయాడు.

ఈ కథవలన మనం నేర్చుకోవలసిన నీతి యేమిటంటే – "మనం భగవానుని ప్రసన్నతను గోరి అనాథులకు, దుఃఖగ్రస్తులకు సేవలు చేస్తుండాలి. అలా సేవలు చేస్తుండగా మనకు భగవత్ప్రాప్తి కలుగడంలో ఆలస్యం అవుతున్నా మనం విసుగు చెందకూడదు. ఆశ వదలకూడదు. పైగా అందరియందూ భగవద్భావన కలిగి ఉంటూ అందరకూ అత్యంతశ్రద్ధతోను, విశ్వాసముతోను, వినయంతోను, ప్రేమతోను, తత్పరతతోను సేవలు చేస్తుండాలి. కారణమేమంటే మనంచేసే సేవలో శ్రద్ధ, ప్రేమ, భగవద్భావన, నిష్కామభావన ఉండడంవలన అది ఉత్తమశ్రేణికి చెందిన సాధన అవుతుంది. కాబట్టి మనం సాధనచేస్తున్న దశలో మనలో ఆ భావాలను పెంపుచేసుకొంటూ ఉండాలి. ఆ భావాలతో బాటు భగవద్భావన, నిష్కామభావన కూడ ఉంటే ఇక చెప్పేదేముంది? ఆ రెండింటిలో ఏ ఒక్క భావన మనలో ఉన్నా మనకు తప్పక భగవత్ప్రాప్తి కలుగుతుంది. కాబట్టి మనం సమస్తప్రాణులయందు ఆ పరబ్రహ్మమైన పరమాత్మ నిండియున్నాడన్న దృఢవిశ్వాసంతో అందరకు సేవ, పరోపకారంవంటి చర్యలు సాగిస్తూ భగవంతుని అనుగ్రహం పొందడంకోసం సాధన చేస్తూనే ఉండాలి.

~~~oOo~~~
~~~

# ౩. జీవన సాఫల్యానికై ఉత్తమ శిక్షణ

శ్లో. ఇంద్రియార్థేషు వైరాగ్యమనహంకార ఏవ చ ।
జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్ ॥
(గీత, 13/8)

ఇహపరలోక సుఖభోగములయందు వైరాగ్యము గల్గి, అహంకారము వీడి జన్మ మృత్యుజరా రోగములవలన గలిగెడి దుఃఖదోషములను పరిశీలించవలెను.

ఈ శ్లోకంలోని భావం హృదయంగమం కావడంకోసం దృష్టాంతంగా క్రింద ఒక కథను కల్పించి పొందుపరుస్తున్నాము.

అవంతికాపురాన్ని విష్వక్సేనుడనే మహారాజు పాలిస్తున్నాడు. అతడు బహు ధర్మాత్ముడు. అతని రాజ్యం ధనధాన్యసంపన్నమై ఉంది. ప్రజలు అతనికి ఆజ్ఞానువర్తులై యున్నారు. అతనికి ఏ విషయంలోనూ కొరతలేదు. కాని సంతానం మాత్రం లేదు. అతడు బహుసద్గుణ సంపన్నుడై, సదాచారపరాయణుడై, వైరాగ్యపరిపూర్ణుడై చరించే ఒక మహాపురుషుని సన్నిధికి తరచుగా వెడలుతూ ఉండేవాడు. ఆయనకు సేవాశుశ్రూషలు ఆచరిస్తూ ఉండేవాడు.

"చాల దినాలుగా నా దగ్గరకు వస్తున్నావు. ఇక్కడకు రావడంలోని ఉద్దేశ్యం ఏమి నాయనా?" అని ఒకనాడు మహాత్ముడు అతనిని ప్రశ్నించాడు.

"మహాత్మా! ఇంటిలో నాకు ఏ విషయంలోనూ కొరతలేదు. నారాజ్యం ధనధాన్యసంపన్నమై ఉంది. కాని పుత్రసంతానము లేదు. అదియే నాకున్న కొరత. కాబట్టి తమరు నాపై దయజూపి నాకు పుత్రుడు కలుగునట్టి ఉపాయమును ఎరిగించండి" అని విష్వక్సేనుడు బదులు

పలికాడు.

"పుత్రప్రాప్తిని ఉద్దేశించి నీవు విష్ణుయాగం చెయ్యి. ఉచితమనితోస్తే భగవానుడు నీ కోరికను ఫలింపజేస్తాడు" అని మహాత్ముడన్నాడు.

మహాత్ముని ఆదేశానుసారం విష్వక్సేనుడు యథావిధిగా విష్ణుయాగం చేసేడు. యజ్ఞశిష్టమైన ప్రసాదాన్ని భార్యకు తినిపించాడు. తత్ఫలితంగా ఆమె గర్భవతి అయింది. పదిమాసాలు గడచిన మీదట ఆమెకు ఒక కుమారుడు జన్మించాడు. ఆ పిల్లవాడు బహుసుందరాకారుడు. బుద్ధిమంతుడు. చూచేవారికి అతడెవడో యోగభ్రష్టుడేమో అన్న భావం కలుగుతూ ఉంది. అతడు జన్మించిన మీదట మహారాజు వానికి శాస్త్రవిధిని అనుసరించి జాతకర్మాది సంస్కారాలు గావించి వానికి జనార్దనుడు అని నామకరణం గావించాడు. ఒకింత పెద్దవాడయిన పిమ్మట ఉపాధ్యాయులను ఇంటిదగ్గరకే రావించి వానికి విద్యాభ్యాసం చేయించాడు. కుశాగ్రబుద్ధి అవడంచేత పిల్లవాడు విద్యలో శీఘ్రముగా పారంగతుడయ్యేడు. అతడు సంస్కృతాదిభాషలలో గొప్ప విద్వాంసుడుయ్యాడు. అయినా అతడు తనతోటి బాలురతో ఎంతో ప్రేమపూర్వకంగా వ్యవహరించేవాడు. ఎవరితోడనూ జగడములు ఆడువాడు కాడు. ఎవ్వరినీ దూషించేవాడు కాడు. అతడు స్వాభావికంగానే సరళస్వభావుడు. సద్గుణసంపన్నుడు. సదాచార పరాయణుడు. చక్కని మేధావి.

ఒకనాడు మహారాజు మహాత్ముని సన్నిధికి వెళ్ళాడు. అక్కడకు తండ్రివెంట కుమారుడు కూడ వచ్చేడు. మహారాజు మహాత్మునకు పాదాభివందనం చేశాడు. అది చూచి పిల్లవాడుకూడ పాదాభివందనం చేశాడు.

అప్పుడు మహారాజు – "మహాత్మా! నాకు మీరు సూచించిన అనుష్ఠానానికి ఫలితంగా, మీదయవలన ఈ కుమారుడు జన్మించాడు. కాబట్టి వీనికి మంచి విషయమేదైన ఉపదేశించండి" అని మహాత్ముని ప్రార్థించాడు.

అంతట మహాత్ముడు ఇలా చెప్పాడు –

శ్లో. ఇంద్రియార్థేషు వైరాగ్యమనహంకార ఏవ చ ।
జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్ ॥
(గీత. 13/8)

ఇహపరలోక సుఖభోగములయందు వైరాగ్యము కల్గి అహంకారమువీడి జన్మ, మృత్యు, జరా, రోగంబులవలన కలిగెడి దుఃఖదోషములను వాటికి హేతువులుగా తలచుకొనవలెనని భావము.

అనంతరం ఆ మహాత్ముడు ఆ పిల్లవాని హావభావవైఖరులను పరికించి – "మహారాజా! ఈ పిల్లవానిలో యోగభ్రష్టుని లక్షణాలు కానవస్తున్నాయి. ఇతడు ముమ్ముందు ఉన్నతశ్రేణికి చెందిన విరక్త మహాపురుషుడు కాగలడని చెప్పాడు.

ఆ మాట విన్న మీదట మహారాజు తన గృహానికి మరలిపోయి తన భార్యను, మిత్రులను, సేవకులను ఏకాంతంలో సమావేశపరచి మహాత్ముడు చెప్పినవిషయం వారికి ఎరిగించి వారిని ఈ విధముగా ఆదేశించాడు. మీరు ఎల్లవేళలా రాజకుమారుని భోగవిలాసాలకు, విందు వినోదాలకు, ఆమోదప్రమోదాలకు సంబంధించిన వాతావరణంలోనే ఉంచుతూ ఉండాలి. భక్తిజ్ఞానవైరాగ్యాలకు సంబంధించిన ప్రసంగాలకు దూరంగా ఉంచాలి. ఏ వస్తువు కూడ వీనిలో భక్తిజ్ఞానవైరాగ్యాలు కలుగడానికి కారణం కాకుండేవిధంగా ఎప్పటికప్పుడు జాగ్రత్త వహిస్తుండాలి.

ఈ రాజాజ్ఞ మేరకు వ్యవస్థ అంతా ఆ విధంగానే చేయబడింది. కాని జనార్దనుని హృదయంలో పూర్వజన్మసంస్కారాలు ప్రబలంగా ఉన్నాయి. వానిని ఎవరు నిరోధింపగలరు? అంతేకాదు. అతని హృదయంమీద మహాత్ముని ఉపదేశంకూడ అంకితమై ఉంది. అతడు సమవయస్కులైన తన ఆటపాటలలో తోడిబాలురతో ప్రవర్తించేవాడు. కాని అతని మనస్సు

ఆటపాటలలోను, భోగవిలాసాలలోను లగ్నమయ్యేది కాదు. అతడు విహారమునకు వెళ్ళి, తిరిగి వచ్చునపుడు మహారాజుచేత ప్రత్యేకంగా జాగరూకత వహించుటకు ఆదేశింపబడిన బుద్ధిశాలియైన విద్యాసాగరుడు అనే మంత్రి సర్వదా అతనిని అనుసరించి వెంట ఉండేవాడు.

క్రమంగా జనార్దనుడు పదునెనిమిది సంవత్సరముల ప్రాయమువాడు అయినాడు. అప్పుడు అతనికి వివాహం జరిగింది. అతడు తన భార్యతో సంసారజీవితమును గడపుట ప్రారంభించేడు. అనతికాలమందే అతని భార్య గర్భవతి అయినది. ప్రసవసమయమున ఒకరోజంతా ఆమె చాల బాధను భరించింది. ఆ రాత్రి ఆమెకు మగబిడ్డ కలిగాడు. ఆ సమయంలో జనార్దనుడు ఆమె చెంతనే ఉన్నాడు. ఆమె భరించిన కష్టమును చూచి అతడు ఎంతో విలవిలలాడాడు. మావితో చుట్టబడి, మాలిన్యముతో నిండి పిల్లవాడు జన్మించగా చూచి అతనికి ఎంతో వ్యథ కలిగినది. తోడనే అతనిలో సహజంగా ఒకింతవైరాగ్యం ఉదయించినది.

క్రమంగా ఆరేయి గడచి తెల్లవారింది. మంత్రులందరూ వచ్చారు. రాత్రి జనార్దనుని భార్య ప్రసవవేదనతో నలిగినందులకు అందరూ చింతించారు. వైద్యులను రావించి చూపించారు. బాధ అనేది పిల్లవానికి కలిగింది. కాని యిప్పుడు ఇక చింతింపపనిలేదని వారు తెలిపారు.

అప్పుడు జనార్దనుడు విద్యాసాగరుని పిలిచి – "మంత్రివర్యా! పుట్టగానే బిడ్డ విలవిల తన్నుకున్నాడు. క్యారుమని యేడ్చాడు. అలా ఎందుకు జరిగింది? అని ప్రశ్నించాడు.

పిల్లవాడు గర్భంలో ఉన్నప్పుడు ద్వారాలన్నీ మూయబడి ఉంటాయి. ఆదశలో ఉండి బయటకు వచ్చినప్పుడు పిల్లవానికి ఎంతో బాధ కలుగుతుందని మంత్రి బదులు చెప్పాడు.

జనార్దనుడు – ఈ మావి, మురికి ఎందులకు ఏర్పడుతుంది?

విద్యాసాగరుడు – ఇదంతా బిడ్డతో బాటు గర్భగతమై ఉంటుంది.

జనార్దనుడు – అట్లయిన గర్భగతుడైన బిడ్డకు కష్టం కలుగదా?

విద్యాసాగరుడు – ఎందులకు కలుగదు. నిజానికి ఈ గర్భవాసక్లేశం బహుదారుణమైనది.

జనార్దనుడు – ఈ గర్భవాసక్లేశం ఏల కలుగుతుంది?

విద్యాసాగరుడు – పూర్వజన్మగతాలైన పాపాల కారణంగా.

జనార్దనుడు – పూర్వజన్మం అంటే ఏమి?

విద్యాసాగరుడు – ఇంతకు ముందు జీవుడు ఏ మానవశరీరాన్ని ధరించాడో అది వానికి పూర్వజన్మం అవుతుంది. ఆ జన్మలో ఇతడు ఏదో పాపం చేశాడు. దాని కారణంగా ఇప్పుడు వీనికి విశేషక్లేశం కలిగింది.

జనార్దనుడు – పాపమంటే ఏమి?

విద్యాసాగరుడు – కల్లలాడడం, కపటం, దొంగతనం, పరస్త్రీగమనం, మద్యపానం, మాంసభక్షణం, ఇతరులకు బాధ కలిగించడం వంటి ఏయే చర్యలను శాస్త్రం నిషేధించిందో అవి యన్నీ పాపాలే.

జనార్దనుడు – శాస్త్రాలంటే ఏవి?

విద్యాసాగరుడు – శ్రుతులు, స్మృతులు, ఇతిహాసాలు, పురాణాలు మొదలైన ధర్మగ్రంథాలే శాస్త్రాలు.

జనార్దనుడు – ఇవి మన యింటిలో ఉన్నాయా?

విద్యాసాగరుడు – లేవు.

జనార్ధనుడు – లేకుంటే తెప్పించండి. నేను చదువుతాను.

అంతట విద్యాసాగరుడు మౌనం వహించాడు. బదులేమీ పలుకలేదు. మంత్రి పలికిన పైమాటలన్నీ విన్నమీదట జనార్ధనుని చిత్తము ఖిన్నమైంది. మరింత విరక్తం అయింది. గర్భవాస సంబంధంగాను, జన్మసంబంధంగాను జీవునకు కలిగే బాధలను తలపోసి అతడు చింతించడం మొదలుపెట్టాడు. అతని వికసిత వదనారవిందం ముకుళితమైపోయింది. అతని ముఖంలో విషాదచ్ఛాయలు అలముకొన్నాయి. వానివైఖరిని చూచి మహారాజు – "మంత్రివర్యా! పిల్లవాడు దిగులుగా ఉన్నాడు. కారణమేమి? అని మంత్రిని అడిగాడు.

బిడ్డ పుట్టినందుకు ఇతని చిత్తంలో వేదన కలిగింది అని మంత్రి బదులు చెప్పాడు. బిడ్డ కలిగినందులకు ఉత్సాహము, ప్రసన్నత కలగాలి. కాని వేదన యెందులకు? అని అంటూ మహారాజు జనార్ధనుని సంబోధించి "నాయనా! దిగులుగా ఉన్నావేమి?" అని వానిని ప్రశ్నించాడు. "ఏదో ఇది నా సహజవైఖరియే" అన్నాడు జనార్ధనుడు.

అప్పుడు విష్వక్సేనుడు – "మంత్రివర్యా! వీనిని ఒకింత అలా బయటకు వాహ్యాళికి తీసుకొనిపొండు! వీని చిత్తానికి ప్రసన్నత కలిగేవిధముగా వీనిని ఒకింత వనాలలోనూ (తోటలు) ఉద్యానాలలోను త్రిప్పి తీసుకొని రండు!" అని అతనికి ఆదేశించాడు.

మంత్రి విద్యాసాగరుడు అలాగే చేశాడు. రాజకుమారుని అందమైన ఒక గుఱ్ఱపుబండిలో ఎక్కించి వాహ్యాళిగా నగరం వెలుపల ఉన్న తోటలవంకకు తీసుకొని పోయాడు. నగరం వెలుపలకు వచ్చినంతనే రాజకుమారుని చూపు ఒక కుష్ఠురోగిమీద పడింది. ఆ కుష్ఠురోగియొక్క చేతివ్రేళ్లు మొండివైయున్నాయి. కాళ్లు, చేతులు, ముక్కు, ముఖము, కన్నులు చూపరకు రోతకలిగిస్తున్నాయి. అతడు కుంటుతూ నడుస్తున్నాడు.

జనార్దనుడు – మంత్రివర్యా! అదేమి? ఆ మానవుడు అలా ఉన్నాడేమి?

విద్యాసాగరుడు – అతడు కుష్ఠురోగి.

జనార్దనుడు – వానికి అట్టిదుర్దశ ఎందులకు ప్రాప్తించింది.

విద్యాసాగరుడు – పూర్వజన్మంలో చేసుకున్న మహాపాపాల కారణంగా.

జనార్దనుడు – నాకు కూడ అలాంటి దశ ప్రాప్తించునందురా?

విద్యాసాగరుడు – భగవానుడు చేయకుండుగాక! అట్టి దశ నీకు రాదు. నీవు పుణ్యాత్ముడవు.

జనార్దనుడు – అట్టి దశ రావచ్చును కదా.

విద్యాసాగరుడు – రాజకుమారా! మహాపాపాలు చేసినవానికే అట్టి వ్యాధి సంక్రమిస్తుంది. నీ విషయంలో నేను ఏమి చెప్పగలను? నీ వెంటను కూడ పూర్వజన్మకృతాలైన మహాపాపాలు ఏవైన ఉండి ఉంటే అట్టి దశ రాదని మాత్రం చెప్పలేను.

జనార్దనుడు – ఈ మహాపాపాలూ, వాని ఫలితాలు ఏ గ్రంథాలలో వర్ణింపబడి ఉంటాయో వానిని నా కోసం తెప్పించే యేర్పాటు చేయండి.

విద్యాసాగరుడు – నీ తండ్రిగారి సెలవు అయితే అలాగే తెప్పించవచ్చును.

అంతలోనే మరియొక మనుష్యుడు రాజకుమారుని కంట బడ్డాడు. వాడు పండు ముదుసలి. వాని చర్మం అంతటా ముడుతలు పడి వ్రేలాడుతూ ఉన్నవి. తలపండి తెల్లబడిపోయింది. అవయవాలు శుష్కించి పోయాయి. చూపు తగ్గిపోయింది. నడుము వంగిపోయింది. అతడు

మూడవకాలును (చేతికర్ర) ఊతగా గ్రహించి గూనివానివలె ముందునకు సాగుతున్నాడు. వాని కాలుచేతులు వణకుతున్నాయి. శ్లేష్మప్రకోపమూ, దగ్గుకారణంగా అతడు ఉండియుండీ విలవిలలాడుతూ ఉన్నాడు. వానిని చూచి రాజకుమారుడు అతడు ఎవరు? అని మంత్రిని ప్రశ్నించాడు.

విద్యాసాగరుడు – వాడు తొంబది సంవత్సరముల వృద్ధుడు.

జనార్దనుడు – నాకు తొంబది సంవత్సరముల వయస్సు వచ్చినప్పుడు నా శరీరంకూడ ఇలాగే అయిపోతుందా?

విద్యాసాగరుడు – కుమారా! భగవానుడు నీకు దీర్ఘాయువు నొసగుగాక! మానవునకు వార్ధక్యం వచ్చినప్పుడు అందరి శరీరమిట్లే పరిణమిస్తుంది.

ఆ మాటవిని రాజకుమారుడు తనకుకూడ అట్టి దశ ప్రాప్తించవచ్చునన్న భావనతో చింతాక్రాంతుడయ్యాడు. ఆ విధముగా వ్యాధిగ్రస్తులు, వార్ధక్యపీడితులు అయిన పురుషులను చూచిన మీదట అతనికి తన శరీరారోగ్యము, సౌందర్యము విషయంగా అలక్ష్య వైఖరి, అశ్రద్ధ ఏర్పడ్డాయి.

వాహ్యాళి(విహారము)నుండి వెనుకకు మరలేవేళ అతనికి ఒక శ్మశానవాటిక కానవచ్చింది. అక్కడ ఒకప్రక్క ఒకశవం కాలుతూ ఉంది. వేరొక ప్రక్క కొందరు జనులు రాం రాం రాం అని రామనామస్మరణం చేస్తూ ఒక శవాన్ని శ్మశానభూమికి కొనిపోతున్నారు. కొందరు మనుష్యులు ఆ శవంవెనుక రోదిస్తూ నడుస్తున్నారు.

ఆ దృశ్యాన్ని చూచి – "ఈ ప్రదేశం ఏమిటి?" అని ప్రశ్నించాడు.

విద్యాసాగరుడు – ఇది శ్మశానభూమి.

జనార్దనుడు – ఇక్కడ జరుగుచున్నదేమి?

విద్యాసాగరుడు – మరణించిన ప్రతి వ్యక్తిని ఇక్కడకు తెచ్చిదహనం చేస్తారు.

జనార్దనుడు – ఈ ఊరేగింపు ఏమి? శవంవెనుక నడుస్తున్నవారు ఏడుస్తున్నారేల?

విద్యాసాగరుడు – ఎవడో యువకుడు మరణించి ఉంటాడు. వాని కుటుంబ సభ్యులు వాని శవాన్ని శ్మశానానికి కొనిపోతున్నారు. ఆ యేడ్చేవారు వాని తండ్రి, సోదరుడు మొదలైన వాని కుటుంబసభ్యులై ఉంటారు.

జనార్దనుడు – మృత్యువు అంటే ఏమి? శవం అంటే ఏమి?

విద్యాసాగరుడు – ఈ శరీరంలోనుండి మనస్సు, ఇంద్రియాలు, ప్రాణాలు, బహిర్గతాలు అయిపోవడమే మృత్యువు. మానవుడు మరణించినప్పుడు వాని శరీరం శవం అనబడుతుంది. దానిని వారి ఇంటివారు ఇక్కడకు తెచ్చి దహనం చేస్తారు. అనంతరం ఇక్కడనుండి మరలి వెడలిపోతారు.

జనార్దనుడు – అయితే వీరు ఏడ్చుటకు కారణమేమి?

విద్యాసాగరుడు – చనిపోయినవానికి వీరి అందరితోను గాఢమైన ప్రేమానుబంధం ఉండి ఉంటుంది. ఇప్పుడు ఆ మానవుడు శాశ్వతముగా వీరినుండి దూరమైపోయాడు. ఆ వియోగంవలన కలిగిన దుఃఖం కారణంగా వారు ఏడుస్తున్నారు.

జనార్దనుడు – అయితే మనం కూడ ఏదో ఒకరోజున ఇలాగే మరణిస్తామా?

విద్యాసాగరుడు – కుమారా! అంతమాట అనవలదు. భగవానుడు నీకు పూర్ణాయువును ఇస్తాడు.

జనార్దనుడు – ఏమయినా ఏదో ఒకనాడు మరణం మాత్రం తప్పదుకదా?

విద్యాసాగరుడు - కుమారా! ఏదో ఒకనాడు అందరూ మరణించ వలసినవారే. జన్మ ఎత్తినవానికి ఏదో ఒకనాడు మరణం అనేది తప్పదు.

మంత్రి మాటలు విని రాజకుమారుడు మరల విచారంలో మునిగిపోయాడు. అటుపిమ్మట మరికొంత ముందునకు పోవగా అతనికి విరాగియైన ఒక మహాపురుషుడు కానవచ్చాడు. అతడెవరు? అన్నాడు మరల జనార్ధనుడు.

విద్యాసాగరుడు - అతడు జీవన్ముక్తుడైన ఒక మహాపురుషుడు.

జనార్ధనుడు - జీవన్ముక్తుడు, విరక్తుడు అనగా ఏమి?

విద్యాసాగరుడు - భగవద్భజనము, ధ్యానము చేసి ఆత్మకళ్యాణం చేకూర్చుకొన్నవాడు.

జనార్ధనుడు - కల్యాణమంటే ఏమిటి?

విద్యాసాగరుడు - వివేకము, వైరాగ్యము, భగవద్భజనము, ధ్యానము మొదలైన సాధనలు చేయగా ప్రాప్తించే శాంతి, ఆనందము కల్యాణం అనబడుతుంది. అట్టి కల్యాణం పొందినవాడు జీవన్ముక్తుడైన మహాపురుషుడు అనబడతాడు. అట్టివాడు శాశ్వతముగా పరమాత్మను పొందుతాడు. ఇక అతడు జననమరణరూపమైన యీ నిస్సారసంసారంలోనికి తిరిగిరాడు. నిజానికి లోకంలో అలాంటి మహాపురుషులే జన్మించాలి. వారి జన్మయే ధన్యమైనదవుతుంది.

జనార్ధనుడు - మంత్రివర్యా! నేను కూడ అలాంటి మహాపురుషుడను కాగలనా?

విద్యాసాగరుడు - ఎందుకు కాకూడదు? మానవుడు మానసికంగా ఎలాకావాలని కోరుకుంటే అలాకావచ్చును. కాని నీవు ఇంకను చిన్న

పిల్లవాడవు. ముందు సంసారసంబంధం అయిన భోగవిలాసాలను అనుభవించాలి. అది అనంతరకాలానికి సంబంధించిన విషయం.

జనార్ధనుడు - అయితే యౌవనదశలో మానవునకు మరణం రాదా? ఇంతకు ముందు మనం త్రోవలో చూచిన ఊరేగింపు ముందు ఉన్న శవం విషయంలో ఎవడో యువకుడు మరణించి ఉంటాడని మీరే కదా అన్నారు?

విద్యాసాగరుడు - యౌవనావస్థలోకూడ మరణం రాదని చెప్పలేము. కాని పూర్వజన్మకృతమైన మహాపాపమేదయినా ఉన్నప్పుడు మాత్రమే మానవుడు యౌవనంలో మరణించించడం సంభవమవుతుంది.

జనార్ధనుడు - అయితే నేను యౌవనావస్థలో మరణించను అని చెప్పడానికి పరమాధారమేదయినా ఉందా?

విద్యాసాగరుడు - పరమాధారం ఎవరికి ఉండదు. మరణానికి ప్రారబ్ధమే ప్రధానకారణమవుతుంది.

ఆ మాటలు విని జనార్ధనుడు మరింత విచారమగ్నుడయ్యాడు. సాధ్యమైనంత శీఘ్రంగా ఆత్మకల్యాణం పొందడం ఎలాగ? అని తనలో ఆలోచించడం మొదలుపెట్టాడు.

క్రమంగా అతడు గృహం చేరాడు. వాని ముఖంలో పూర్వంలోకంటె ఎక్కువ ఉదాసీనత కానరాగా చూచి విష్వక్సేనుడు చింతామగ్నుడయ్యాడు. మూడవనాడు కూడ రాజకుమారుడు అలాగే ఉండడం చూచి అతడు- "మంత్రివర్యా! రాజకుమారుని ముఖం ఉల్లాసభరితంగా ఉండడంలేదు. అందులకు కారణమేమి?" అని మంత్రిని ప్రశ్నించాడు.

విద్యాసాగరుడు - మహారాజా! ఏమని చెప్పగలను? తనకు కుమారుడు కలిగిననాటినుండి మూడు రోజులుగా రాజకుమారుడు ఇలాగే ఉంటున్నాడు.

అనగా విని మహారాజు మరల ఇలా అన్నాడు – "మంత్రివర్యా! వీనిని అధికాధికంగా విషయభోగాలలోను, విలాసవినోదాలలోను సంలగ్నుని గావించండి. సముచితరీతిని వీని మిత్రులకు నచ్చజెప్పి వారితోడ వీనిని నాటక ప్రదర్శనశాలలకు, వినోదగృహాలకు పంపుతూ ఉండండి. తినడానికి వివిధములైన స్వాదిష్టపదార్థాలను, మృష్టాన్న ఫలాదులను అర్పిస్తుండండి. మనోహరంగాను, ఆకర్షణీయంగాను ఉండే దృశ్యాలను వీనికి చూపుతూ ఉండండి. వీని తలమీద, శరీరము మీద అత్తరులు, సెంట్లు పులమండి. నాట్యగాన ప్రదర్శనాలను కల్పించి వీని మనస్సును ఉల్లాసభరితం చేస్తుండండి".

రాజాజ్ఞ ప్రకారం మంత్రి అన్నియేర్పాట్లు చేశాడు. కాని ఎన్ని చేసినా అన్నీ నిరర్థకాలయ్యాయి. రాజకుమారునకు సంసారసంబంధమయిన ప్రతివస్తువూ సారహీనంగానే కానవస్తూ ఉంది. ఏదీ సుఖదాయకంగా తోచటం లేదు. పదార్థాలన్నీ నశ్వరాలు, దుఃఖదాయకాలు, రూక్షములుగా తోస్తున్నాయి. భోగాలముసుగులో రోగాలుదాగియున్న కారణంగా వానిమీద వాని మనస్సు లగ్నం కావడంలేదు. భోగాలను అనుభవించడం అనేది వానికి ఒక తగులంలాగున తోస్తూ ఉంది. అత్తరులు, సెంట్లు వానికి మూత్రతుల్యంగా కానవస్తున్నాయి. పూలపాన్పులు, పూలదండలు, చందనము మొదలైనవి ఉబ్బసపురోగికి తడిబట్టల లాగున వానికి రుచించడంలేదు. వీణామృదంగాదిగోష్ఠి అతని చెవులకు దుర్భరకోలాహలంగా తోస్తుంది. నాటకాదిక్రీడలు, వింతలు, వినోదాల ప్రదర్శనలు వానికి అక్కరమాలిన జంజాటంగా కానవస్తున్నాయి, మంచిమంచి ఫలాలు, మృష్టాన్నాదులు, వానికి జ్వరగ్రస్తునకువలె ఏవగ కలిగిస్తున్నాయి. తన శరీర విషయంలోను, విషయభోగాల విషయంగాను ప్రబలమైన విరక్తి కలిగిన కారణంగా లోకంలోని ఏవస్తువు అతనికి రుచించడంలేదు. ఏ విషయంలోను ఎట్టి ఆకర్షణయూ అతనికి అనుభవగోచరం కావడంలేదు.

కుమారుని ముఖంలో వ్యక్తమవుతున్న ఉదాసీనతను, విషాదముద్రను చూచి మహారాజు – "కుమారా! నీకు కొడుకు పుట్టి మూడు

రోజులయింది. కాని నీ ముఖంలో ఆనందం కానరావడంలేదు. ఏదో వేదననుభవిస్తున్నవానివలె కానవస్తున్నావు. అందులకు కారణమేమి? ఎంతో సంతోషంగా ఉండవలసిన తరుణంలో ఈ సంతాపం, చింత యెందులకు?" అని వానిని ప్రశ్నించాడు.

అప్పుడు జనార్ధనుడు ఇలా బదులుచెప్పాడు – "తండ్రీ! మీరు చెప్పినది నిజం. పిల్లవాడు పుట్టినప్పుడు మావితోను, మాలిన్యంతోను కూడి ఉండడము, కరుణాజనకంగా రోదించడము చూచి నాకు చాల దుఃఖము, ఆశ్చర్యము కలిగాయి. అలా ఎందుకు జరిగిందని నేను మంత్రివర్యులను అడిగాను. అది యంతయూ వాని పూర్వజన్మకృతపాపాల ఫలం అని వారు చెప్పారు. వారిమాట విన్న మీదట ఈ జన్మలో నేను, కల్ల, కపటము, దొంగతనము, వ్యభిచారము, హింస, మాంసభక్షణము, మద్యపానము వంటి పాపాలకు పాల్పడితే నేను కూడ ఈ విధముగా గర్భవాపక్లేశాన్ని జన్మదుఃఖాన్ని అనుభవించవలసినవాడనవుతాను అన్న ఆలోచన నాకు కలిగింది. ఆ కారణంగా నా మనస్సు చింతాక్రాంతం అయింది".

తనయుని మాటలు విని మహారాజు – "కుమారా! అదంతా అబద్ధం. అభూతకల్పన. మరణించినవానికి మరల జన్మమే కలుగదు. అని చెప్పి మంత్రివంకకు తిరిగి – ఏమి! మంత్రివర్యా! మీరు ఈ విషయాలు అన్నీ వీనికి చెప్పేరా?" అని అతనిని ప్రశ్నించాడు.

అవును చెప్పేనన్నాడు మంత్రి కంపిస్తూ. అప్పుడు జనార్ధనుడు– "తండ్రీ! మీ ఆజ్ఞానుసారం ఈ మంత్రివర్యులు నన్ను విహారమునకై నగరం వెలుపలకు తీసుకొని వెళ్ళారు. అక్కడ నాకు త్రోవలో కుష్ఠురోగి ఒకడు కానవచ్చాడు. వానిని చూడగా నాకు దుఃఖం కలిగింది. అతడు రోగగ్రస్తుడై ఉండుటకు కారణమేమి? అని నేను వీరిని అడిగాను. పూర్వజన్మలో వాడు చేసుకొన్న మహాపాపాల ఫలం అని వీరు చెప్పారు".

"కుమారా! పాపమనేది ఏదీలేదు. ఇది యీ మంత్రివరులవంటి

మూర్ఖులు చేసిన అభూతకల్పన. నీవు చూచిన కుష్ఠురోగి అలాగే పుట్టినవాడు. అలాగే ఉండేవాడు. వానికి నీకు పోలిక యేమి? నీవు ఎలా పుట్టావో, ఎలా ఉన్నావో అలాగే ఉంటావు" అని మహారాజు తనయుని అనునయించాడు.

అటుపిమ్మట అతడు కుపితుడై – "మీతెలివిని చూడగా నాకు చాల క్షోభ కలుగుతుంది. ఈ పిల్లవానికి మీరు ఇట్టి మాటలు ఎందులకు చెప్పారు" అని మంత్రిని గద్దించాడు.

"ప్రభూ! ఈ విషయంలో నేను ఎరిగినదానిని కుమారుని ప్రశ్నలకు సమాధానముగా చెప్పాను" అని మంత్రి బదులు పలికాడు.

అప్పుడు జనార్ధనుడు మరల ఇలా అన్నాడు – "అనంతరం మాకు త్రోవలో బహుదుఃఖగ్రస్తుడైన వృద్ధుడొకడు కానవచ్చాడు. నేను ఇంతకు ముందు అట్టివానిని చూచియుండలేదు. తెలుసుకొనుటకై మంత్రివర్యులను అడుగగా అతడు వయస్సు ముదిసినవాడు అని చెప్పాడు. వయస్సు ఎక్కువగా చెల్లినవారికి అందరకూ అట్టి పరిస్థితి వస్తుందని తెలుసుకొన్న మీదట ఒకనాటికి నాకు కూడ అట్టి దశ ప్రాప్తించగలదన్న భావనతో నాకు విచారం కలిగింది".

"కాదు. కాదు. అలా ఎన్నటికినీ జరుగదు. వృద్ధులు వృద్ధులుగానే ఉంటారు. యువకులు యువకులుగానే ఉంటారు. అని మహారాజు అన్నాడు" అతడు క్రోధముతో మరల – "మంత్రివర్యా! ఇలాంటి పాఠాలు చెప్పి పిల్లవాని మనస్సును పాడుచేయుటకా మిమ్ము నియమించినది?" అని మంత్రిని గద్దించాడు.

"రాజకుమారుడు అడిగినప్పుడు నేను ఎరిగిన మాటలు చెప్పడం జరిగింది" అని మంత్రి బదులుచెప్పాడు.

"ఇదియా మీ తెలివి? గొప్పతెలివండి మీది. ఏమి? ఇలాంటి

విషయాలు చిన్నపిల్లలకు చెప్పవలసినవా?" అని మహారాజు మంత్రిని ఈసడించాడు.

మరల జనార్దనుడు ఇలా అన్నాడు – "తండ్రిగారూ! అటు పిమ్మట మేము వాహ్యాళి ముగించుకొని మరలి వస్తున్నాము. అప్పుడు నేను ఒక దృశ్యం చూచాను. అదేమంటే చాలమంది జనులు ఒక చనిపోయిన మనుజునకు దహనసంస్కారం చేస్తూ చుట్టునిలిచియున్నారు. అప్పుడే కొంతమంది జనులు గుంపుగా, ఊరేగింపుగా అక్కడకు వస్తున్నారు. వారి వెంట నలుగురు వ్యక్తులు ఏదియో ఒక వస్తువును భుజములమీదకు ఎత్తుకొని నడుస్తున్నారు. వారి వెనుక మరికొందరు మనుష్యులు రోదనంచేస్తూ ముందుకు సాగుతున్నారు. ఇంకను కొందరు రాం రాం రాం అంటూ రామనామస్మరణం చేస్తున్నారు. ఆ దృశ్యాన్ని చూడగా నాకు ఎంతో ఆశ్చర్యం కలిగింది. అదేమి? అని మంత్రివర్యులను అడుగగా వారు ఎవరో యువకుడు మరణించాడని, వానిని వాని కుటుంబసభ్యులు శ్మశానవాటికకు కొనిపోతున్నారని, వారందరూ అతడు తమకుదూరం కావడంవలన ఏడుస్తున్నారని తెలియజెప్పాడు. ఆ దృశ్యం చూచినప్పటి నుండి నాకుకూడ మరణం సంభవిస్తుందన్న చింత నాలో ప్రవేశించింది. నేను మరణించినప్పుడు నాకుకూడ అట్టి దశయే ప్రాప్తిస్తుందని నేను భావించుకొంటున్నాను".

ఈ మూర్ఖమంత్రి మాటలను నీవు పట్టించుకోవలదు. యౌవనదశలో ఉన్నవాడు ఎన్నడూ మరణించడు. ఈ మంత్రి చెప్పిన మాటలు తెలివితక్కువతనపు మాటలు" అని కుమారునితో పలికి–"ఏమయ్యా! ఇలాంటి దృశ్యాలను చూపి యిలాంటి మాటలు చెప్పి మా బిడ్డను బెదరజేయడం మీరు చేయదగిన పనియేనా? మీరు నాకు చేసినది నయవంచనయే కాని మంచి యేదీలేదు" అని మంత్రిని మహారాజు తిరస్కరిస్తూ మాట్లాడాడు.

"మహారాజా! రాజకుమారుడు అడిగినప్పుడు నామదికి స్ఫురించిన విషయం నేను చెప్పడం జరిగింది" అని మంత్రి మారు పలికాడు.

అనంతరం జనార్దనుడు మరల ఇలా అన్నాడు – "క్రమంగా మేము నగరంలో ప్రవేశించాము. అప్పుడొక కాషాయవస్త్రధారి మా కంటబడ్డాడు. అతడెవడు? అని నేను మంత్రివర్యులను అడిగాను. అతడొక జీవన్ముక్తమహాపురుషుడని, అతడు చిరకాలం భగవద్భజనము, ధ్యానము, సత్సంగము, స్వాధ్యాయము వంటి సాధనలు చేసి ఆత్మకల్యాణం చేకూర్చుకొన్నవాడని తత్కారణముగా అనుక్షణము, శాంతిని పరమానందాన్ని పొందుతుంటాడని అతడు కడపట భగవానుని పరమధామానికి వెడలిపోతాడని, అక్కడనుండి యిక ఈ దుఃఖమయప్రపంచంలోనికి తిరిగిరాడని, అచ్చటనే పరమశాంతిని, పరమానందాన్ని పొందుతూ ఉండిపోతాడని, అట్టివారి పుట్టుకే ధన్యమైనదని వారు నాకు తెలియచెప్పారు. ఈ విషయాలన్నీ ఎందులో వివరింపబడి ఉంటాయి? అని నేను అడుగగా శ్రుతులు, స్మృతులు, ఇతిహాసాలు, పురాణాలు మొదలైన ధార్మికగ్రంథాలలో ఉంటాయని వారు చెప్పారు. ఆ గ్రంథాలను నాకు తెప్పించిపెట్టుడని నేను వారిని కోరాను. మీ తండ్రిగారి ఆజ్ఞ అయితే తెప్పించిపెడతాను అని వారు బదులు చెప్పారు కాబట్టి నాకు ఆ గ్రంథాలను తెప్పించి ఈయరా?".

"నాయనా! ఆ గ్రంథాలు నీవు చదువదగినవికావు," అని విష్వక్సేనుడు వాని మాటను నిరాకరించాడు. అనంతరం కోపంతో మంత్రివంకకు తిరిగి – "మీరు ఆ గ్రంథాలపేర్లు చెప్పి పిల్లవాని బుర్రను పాడుచేసారు. మీరు చెప్పిన మాటల ప్రభావమే ఇది. సుకుమారుడైన నా కుమారుడు ఇంత చిన్నవయస్సులోనే లోకసంబంధమైన భోగవిలాసాలయెడల విరక్తిని పెంచుకొని అనుక్షణము జ్ఞానవైరాగ్యాది విషయాల చింతనలో మునిగిపోయాడు. నేను మిమ్ము ఏమి కోరి నియమించానో దానికి మీరు విపరీతపరిణామాన్ని తెచ్చిపెట్టారు. మీరు నా కొలువులో ఉండదగినవారు కారు. ఇప్పుడే యీ క్షణమందే మీ యిచ్చవచ్చిన దిక్కునకు వెడలిపొండు" అంటూ అతనితో కోపంగా అన్నాడు.

"మహాప్రభూ! నా తెలివితక్కువతనం కారణంగానే యీ పరిణామం

ప్రాప్తించింది. రాజకుమారుడు అడిగిన ప్రశ్నలకు నా బుద్ధిని అనుసరించి నేను సరియైన సమాధానాలే చెప్పాను. అందులకు నన్ను మన్నించండి!" అన్నాడు మంత్రి రెండు చేతులు జోడించుకొని.

"మీ తెలివి తగులబడినట్లే ఉంది. ఇక్కడ నిలచి ఉన్న నా కొంప నిలువున కూలిపోయినట్లయింది. ఇక మీరు నా కొలువులో ఉండదగరు" అని పలికి మహారాజు విద్యాసాగరుని మంత్రిపదవినుండి తొలగించివేసాడు.

అప్పుడు జనార్దనుడు ఇలా అన్నాడు – తండ్రీ! మీరు అలా చేస్తారేమిటి? ఇందు మంత్రివర్యుల దోషమేమీలేదు. ఆయన చెడు ఏమీ చెప్పలేదు. చెప్పినదేదో మంచియే చెప్పాడు. అది కూడ నేను అడిగిన మీదట చెప్పాడు. నాలో భక్తి జ్ఞానవైరాగ్యాలు కొంచెం కూడ లేవు. అది కావాలని నేను కోరుకుంటున్నాను. అది నాకు ప్రాప్తిస్తే నేను కూడ జీవన్ముక్త మహాపురుషుడనై ఆత్మకల్యాణం చేకూర్చుకోగలుగుతాను. సంసారం విషయంలో విరక్తులై భగవద్భజనము, ధ్యానము, సత్సంగము, స్వాధ్యాయము వంటి సాధనలు చేసి ఆత్మకల్యాణం చేకూర్చుకొన్నవారు నిజంగా ధన్యాత్ములు. నాలో దేహాభిమానం కరగి, సంసారం విషయంలో వైరాగ్యం పెరిగి నా మనస్సు నిరంతరము పరమాత్మయందు లగ్నమై ఉండే విధంగా మీరు నన్ను ఆశీర్వదించండి".

రాజకుమారుడాడిన యీ మాటలను హర్షించక విష్వక్సేనుడు అతని ఆలోచనలకు విరుద్ధంగా ఏమేమో చెప్పి వానిని సంసారమార్గానికి మరలించడానికి ఎంతో ప్రయత్నించాడు. అయినా ఆయన చెప్పినమాట ఒకటి కూడ అతనికి రుచించలేదు. కారణమేమంటే అతడు యోగభ్రష్టుడు. పైగా మంత్రి చెప్పిన మాటలు అతని మనఃఫలకంమీద ముద్రితాలు అయిపోయాయి. వైరాగ్యప్రభావం అతని మనస్సును క్రమ్మివేసింది. అతడు క్రమముగా అహంకారమమకారాలను వీడి సంసారమందు అనాసక్తుడుగా ఉంటూ భగవానుని అన్వేషించే దిశగా తన జీవనయాత్ర సాగించడం మొదలుపెట్టాడు.

అలా కొంతకాలం గడవగా రాజకుమారునకు తీవ్రమైన వైరాగ్యదశ ప్రాప్తించింది. కానవచ్చే సర్వమునందూ తటస్థవైఖరి సిద్ధించింది. అప్పుడు అతడు స్వాభావికంగానే రాజ్యం విషయంలో అనాసక్తుడై ఉండి చిన్ననాడు తనకు సదుపదేశం చేసిన గురువరేణ్యుడైన మహాత్ముని సన్నిధికి అరిగాడు. ఆ మహాత్ముడే ఇంతకుముందు అతనికి ఈ శ్లోకాన్ని ఉపదేశించాడు-

శ్లో. ఇంద్రియార్థేషు వైరాగ్యమనహంకార ఏవ చ ।
జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్ ॥
(గీత. 13/8)

ఈ శ్లోకభావం రాజకుమారుడైన జనార్దనునియందు అక్షరాల చరితార్థమై ఉంది. "నాకు భక్తిజ్ఞానవైరాగ్యాలను ప్రసాదించండి," అని అతడు మహాత్ముని కోరాడు. అప్పుడు మహాత్ముడు అతనికి ఊరటగొలిపి భక్తిజ్ఞానవైరాగ్యాలను తాత్త్వికంగా ఉపదేశించాడు.

శ్లో. అసక్తిరనభిష్వంగః పుత్రదారగృహాదిషు ।
నిత్యం చ సమచిత్తత్వమిష్టానిష్టోపపత్తిషు ॥
మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ ।
వివిక్తదేశ సేవిత్వమరతిర్జనసంసది ॥
అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్ ।
(గీత, 13/9-11)

పుత్రులు, భార్య, గృహము మున్నగువానియందు ఆసక్తి లేకుండుట, వానితో తగులము లేకుండుట, ఇష్టానిష్టాలు ప్రాప్తించిన వేళ సదాసమచిత్తస్థితి కలిగియుండుట, నాయందు ఏకాగ్రతాపూర్వకమై చలింపకుండు భక్తిని కలిగియుండుట, ఏకాంతప్రదేశమును ఆశ్రయించుట, జనసందోహమునందు ఇష్టము లేకుండుట, అధ్యాత్మజ్ఞానమునందు స్థిరముగా నిలిచియుండుట, తత్త్వజ్ఞానముయొక్క ప్రయోజనమును పరికించుచుండుటయు (జ్ఞానలక్షణాలు).

ఇక్కడ 'అనభిష్వంగః' అనే మాటకు మమకారం లేకపోవడమని అర్థం. మానవునకు దారాపుత్రాదులతోడ దృఢమైనసంబంధం ఏర్పడడానికి

ఈ మమకారమే కారణభూతమైనది. అందుచేతనే అతడు లాభనష్టాలను, సుఖదుఃఖాలనుబట్టి తాను స్వయముగా సుఖాన్ని దుఃఖాన్ని పొందుతుంటాడు. మమకారం లేనప్పుడు ఈ సుఖదుఃఖాలుండవు. కాబట్టి మానవుడు ఎల్లవస్తువులతోడను మమకారం లేకుండా జాగ్రత్తపడుతూ ఉండాలి.

అనుకూలంగా ఉండే వ్యక్తి, క్రియ, సంఘటన, పదార్థము మొదలైన వానితోడ సంబంధం 'ఇష్టం' అనబడుతుంది. అలాగే ప్రతికూలమైన వానితోడ అనుబంధం లేకపోవడం కూడ 'ఇష్టమే' అవుతుంది. అలాగే అనుకూలమయినది దూరం కావడం, ప్రతికూల మయినది ప్రాప్తించడము రెండూ 'అనిష్టం'గా పరిగణింపబడతాయి. ఈ ఇష్టంతోను, అనిష్టంతోను సంబంధం కలిగినప్పుడు హర్షాన్ని, శోకాన్ని పొందకుండ ఉండడము అనగా అనుకూలమైనది ప్రాప్తిస్తే ప్రతికూలమయినది దూరమయితే ఆ రెండు దశలలోను మనస్సులో రాగము, కామము, హర్షము వంటి భావాలు కలుగకుండా ఉండడము, అలాగే ప్రతికూలమైనది ప్రాప్తిస్తే, అనుకూలమైనది దూరం అయితే ఆ రెండు దశలలోను ద్వేషము, శోకము, భయము, క్రోధము మొదలైన భావాలు కలుగకుండా ఉండడము అనగా సర్వకాలసర్వావస్థలయందు నిర్వికారంగాను, ఏకరీతిగా సమానంగాను ఉండడం – ఇది ఇష్టము, అనిష్టము ప్రాప్తించిన సందర్భాలలో ఉండవలసిన సమచిత్తత్వం అనబడుతుంది.

భగవానుడు ఒక్కడే సర్వశ్రేష్ఠుడు. అతడే మనకు స్వామి. శరణ్యుడు, పరమగతి, పరమాశ్రయస్థానం, తల్లి, తండ్రి, సోదరుడు, చుట్టము, పరమహితకరుడు, పరమాత్మీయుడు, సర్వస్వము అతని కంటె మనకు పరమాధారులు వేరెవ్వరూ లేరు. అను ఇట్టి భావనలో భగవానుని తోడ ఏర్పరచుకొన్న సంబంధమేదో అది "అనన్యయోగం" అనబడుతుంది. ఈ విధమైన సంబంధంతోనే కేవలము ఒక్క భగవానునియందే అచంచలము, విశుద్ధము అయిన ప్రేమ కలిగియుండి అతని భజనము, ధ్యానము చేస్తుండడమే 'అనన్యయోగం' ద్వారా భగవానునియందు

అవ్యభిచారిణి అయిన భక్తి కలిగి ఉండటం అనబడుతుంది.

ఈ విధమైన భక్తిమార్గాన్ని అవలంబించిన వానిలో స్వార్థము, అభిమానము వంటి అవలక్షణాలు లేశమాత్రంగా కూడ ఉండవు. ఏ సాంసారికవస్తువుమీదను వానికి మమకారం ఉండదు. భగవత్సంబంధానికి విఘాతం కలుగనంతవరకు మాత్రమే అతడు లోకంతో సంబంధాన్ని పాటిస్తాడు. తద్భిన్నంగా అతడు దేనితోటీ స్వతంత్రంగా ఎట్టి సంబంధము పెట్టుకోవడానికి ఇష్టపడడు. అతడు సర్వము భగవదాయత్తంగా భావిస్తాడు. శ్రద్ధతో, ప్రేమతో నిష్కామభావంతో అవిరామంగా భగవానునే చింతనం చేస్తుంటాడు. అతడేమి చేసినా భగవానుని ప్రసన్నతను కోరియే చేస్తుంటాడు."

సాధకుడైనవాడు సదా ఏకాంతవాసం (వివిక్తదేశ సేవనం) చేయాలి. జనసమ్మర్దము, కోలాహలము లేని చోటు, ఇతరులెవ్వరూ లేనిచోటు, తన ఉనికివలన ఇతరులకెట్టి అభ్యంతరము, క్షోభము కలుగనిచోటు, ఎట్టి మాలిన్యములేనిచోటు, కంటకాలు, కంకర్రాళ్ళు చెత్తచెదారాలు లేని చోటు, కన్నుల పండువు గావింపగల ప్రకృతిదృశ్యాలు ఉన్నచోటు, వాతావరణం బహు నిర్మలంగా ఉన్నచోటు, వ్యాధుల ప్రాబల్యం లేని చోటు, క్రూరజంతువులుకాని, హింసాలక్షణంకాని లేని చోటు, సహజంగా సాత్త్వికభావపరమాణువులు ప్రబలంగా ఉన్నచోటు, ఇట్టివి ఒక దేవాలయము, తపోభూమి, గంగాది పవిత్రనదీతీరభూమి, పవిత్రవన ప్రాంతము, కొండగుహ మొదలైన నిర్జనప్రాంతాలు ఏకాంతప్రదేశాలు "వివిక్తదేశాలు" అనబడతాయి. జ్ఞానాన్ని పొందడంకోసం సాధన చేయాలి అంటే అట్టి ప్రదేశంలో నివాసం చేయాలి. అలా చేయడం వివిక్తదేశసేవనం అవుతుంది.

సాధకుడు ఎన్నడూ విషయలంపటులైన వారితో స్నేహానుబంధము, ప్రేమానుబంధము పెట్టుకోరాదు. పైశ్లోకంలో ఉపయోగించబడిన 'జనసంసది' అన్నమాట ప్రమత్తులు, విషయాసక్తులు అయిన మనుష్యులను ఉద్దేశించి చెప్పబడినది. అట్టివారితోడి సాంగత్యం సాధనామార్గంలో సర్వవిధాల అవరోధహేతువుగా భావించుకొని వారితో

ప్రేమానుబంధం లేకుండా దూరంగా ఉండడమనేదే "అరతిర్జనసంసది" అనే మాటకు తాత్పర్యం. సాధువులు, మహాత్ములు, సాధకులు అయినవారితోడి సాంగత్యం సాధనలో సహాయకారి అవుతుంది. కాబట్టి "జనసంసది" అనే మాటకు ఇలాంటి సచ్చరిత్రుల సముదాయం అనే అర్థం చెప్పుకోకూడదు.

ఆత్మ నిత్యమైనది. వికారంలేనిది. వినాశంలేనిది. ఇందులకు భిన్నంగా నాశవంతములై వికారములై (మార్పు) పరివర్తనలక్షణం కలవస్తువులు ఏవి ఉన్నా అవన్నీ అనాత్మపదార్థాలు. వానితో ఆత్మకు సంబంధంలేదు. శాస్త్రాల సాయంతోను, గురూపదేశం మూలంగానూ ఆత్మతత్త్వాన్ని చక్కగా తెలుసుకోవడమే "అధ్యాత్మజ్ఞానం" అనబడుతుంది. జ్ఞానాన్ని బుద్ధిలో నిలుపుకొని దృఢనిశ్చయం కలిగి మానసికంగా ఆత్మతత్త్వాన్ని నిరంతరం మననం చేస్తుండడమే "అధ్యాత్మజ్ఞాననిత్యత్వం" అనే మాటలోని ఆంతర్యం.

తత్త్వజ్ఞానం అంటే సచ్చిదానందఘనుడు, పూర్ణబ్రహ్మము అయిన పరమాత్మ, కారణమేమంటే తత్త్వజ్ఞానంవలన ఆ పరమాత్మనే పొందడం జరుగుతుంది. తత్త్వజ్ఞానార్థదర్శనం అనగా సచ్చిదానందఘనుడు, గుణాతీతుడు అయిన పరమాత్మను సర్వత్రా సమభావంతో ధ్యానిస్తుండడమే ఆ ఆర్థమును దర్శించుట. తెలిసెనా నాయనా? అని ఉపదేశం చేసి మహాత్ముడు మౌనం వహించాడు. రాజకుమారుడు ఉపదేశగ్రహణానికి పాత్రమైనవాడే కదా! ఆ ఉపదేశాన్ని అనుసరించి సాధన చేయగా అతనికి అనతికాలమందే పరమాత్మప్రాప్తి కలిగింది.

ఇక అక్కడ మరునాడు రాజభవనంలో మహారాజు విష్వక్సేనుడు మేలుకొన్నాడు. అప్పుడతనికి తన కుమారుడు ముందునాటి రాత్రి రాజభవనం వీడి ఎటకో వెడలిపోయాడన్న వార్తతెలిసింది. కుమారునకై అతడు నాలుగు దిక్కులా వెదకించాడు. కాని ఫలితం లేకపోయింది. అప్పుడతడు ఎంతో విచారించాడు.

అనంతరం కొన్నిదినాలు గడచినమీదట మహారాజు మహాత్ముని

దర్శించుటకై ఆశ్రమానికి వెళ్ళాడు. ఆయనకు సాష్టాంగనమస్కారం చేసి మహాత్మా! తమరు నాకు ప్రసాదించిన కుమారుడు గృహంవీడి యెక్కడకో వెడలిపోయాడు అని ఆయనతో చెప్పాడు.

అప్పుడు మహాత్ముడు ఇలా అన్నాడు – ఏమి? మీకు తెలియదా? అతడు కొన్ని దినములుగా నా చెంతనే ఉంటున్నాడు. అతడు సర్వదా జ్ఞానధ్యానాదిసాధనలలో నిమగ్నుడై ఉంటున్నాడు. అతడు తన జన్మను ధన్యం చేసుకొన్నాడు. నేను ఆదిలోనే చెప్పియున్నాను కదా! ఈ పిల్లవాడు సాధారణుడు కాడు, మున్ముందు ఉన్నతశ్రేణికి చెందిన మహాపురుషుడు కాగలడని. ఆ మాట యీనాడు నిజమయింది. రాజేంద్రా! ఇలాంటి మహాపురుషుని బిడ్డగా బడసినందులకు మీ జన్మకూడ ధన్యమయింది. మీ బిడ్డ యెట్టిన భాగ్యశాలియే.

రాజకుమారునకు అంత శీఘ్రంగా ప్రాప్తించిన ఆశాతీతమైన ఔన్నత్యాన్ని గూర్చివిని వాని పరిస్థితిని కన్నులారగాంచి మహారాజు పరమాశ్చర్యాన్ని పొందేడు. అంతటితో తన కుమారుడు ఇల్లు విడిచి వెడలిపోవడం వలన అతనికి గలిగిన దుఃఖం తీరిపోయింది. అతడు అదియంతయూ తన మహాభాగ్యంగా భావించుకొని పరమానందం పొందాడు.

అనంతరం ఆ మహారాజు తనకు ఏదైన సదుపదేశం చేయుమని మహాత్ముని ప్రార్థించాడు. తనకుకూడ సంసారమందు విరక్తి కలిగే విధముగా తనను అనుగ్రహింపుడని వేడుకున్నాడు. అప్పుడు మహాత్ముడు సంతోషించి యీ శ్లోకాన్ని ప్రవచించాడు–

శ్లో. ఇంద్రియార్థేషు వైరాగ్యమనహంకార ఏవ చ ।
జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్ ॥

(గీత. 13/8)

అనగా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు అనేవి విషయ పదార్థములు. వానిని అంతఃకరణము, ఇంద్రియాలద్వారా అనుభవించడం

జరుగుతుంటుంది. అజ్ఞానం కారణంగా మానవుడు వానిలో సుఖం ఉందని భ్రమపడుతుంటాడు. నిజానికి వానిలో ఉన్నది సుఖంకాదు. సర్వమూ దుఃఖమే. ఆ యన్నిటియందూ ఈషణ్మాత్రము ప్రేమలేకుండ ఉండడమనేదే "ఇంద్రియార్థేషు వైరాగ్యమ్" అనగా ఇంద్రియాలకు సంబంధించిన విషయాలయందు విరక్తి కలిగి ఉండడం అనబడుతుంది.

మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు, శరీరము – వీనియందు మనలో "నేను" అనే భావన ఉంటుంది. అనగా అజ్ఞానం కారణంగా మనం ఈ అనాత్మవస్తువులందు ఆత్మభావన చేస్తున్నాము. ఈ దేహాభిమానాన్ని పూర్తిగా విసర్జించడమే "అనహంకార" స్థితి అనబడుతుంది.

జన్మక్లేశం అనేది బహుదుర్భరమయినది. తొలుత జీవుడు మాతృగర్భంలో ప్రవేశించి అసహాయుడుగా దీర్ఘకాలపర్యంతము వివిధవిధాలైన క్లేశాలను భరించవలసినవాడు అవుతున్నాడు. అటుపిమ్మట జననకాలంలో యోనిద్వారమున బహిర్గతుడు కావడంలో కూడ దుర్భరమైన వేదనను భరించవలసినవాడు అవుతున్నాడు. అనేక యోనులలో పరిభ్రమిస్తున్న కారణంగా, పర్యాయంగా గర్భవాసక్లేశాన్ని, జన్మదుఃఖాన్ని అనుభవిస్తున్నాడు. ప్రతిసారి మరణకాలంలో కూడ మహాకష్టాన్ని భరిస్తున్నాడు. ఏ శరీరాన్ని ఏ గృహాన్ని నాదినాది యని భావించుకొంటూ జీవించాడో దానిని బలవంతంగా వీడిపోవలసి వస్తుంది. మరణకాలంలో మరణించేవాని నిరాశములైన కన్నులను, శారీరిక పీడను చూస్తే అతడెంతటి యాతనను భరిస్తున్నాడో మనం ఊహించి తెలుసుకోగలము. వార్ధక్యంలో కలిగే బాధకూడ అల్పమైనది కాదు. ఆ దశలో ఇంద్రియాలకు పటుత్వం తగ్గిపోతుంది. శరీరం శిథిలమైపోతుంది. మనస్సులో లాలస తరంగాయితం అవుతుంటుంది. అసహాయదశ ప్రాప్తిస్తుంది. ఆ పరిస్థితిలో కలిగే బాధ దుర్భరంగా ఉంటుంది. అలాగే వ్యాధిజన్యమైన బాధకూడ బహుదుస్సహంగా ఉంటుంది. శరీరం కృశించిపోతుంది. అనేకవిధాల సహింపరాని వేదనలు ప్రాప్తిస్తాయి. పరాధీనత పెరుగుతుంది. ఏమీ చేయవీలులేని పరిస్థితి దాపురిస్తుంది. ఇలాంటివన్నీ జన్మమృత్యు జరావ్యాధుల వలన కలిగే దుఃఖాలు. వీనిని నిరంతరము దృష్టిలో

ఉంచుకోవడం, వీనిని గూర్చి ఆలోచిస్తుండడం, ఇది దుఃఖదోషానుదర్శనం అనే మాటలోని ఆంతర్యం.

జీవులకు వారు చేసుకొన్న పాపాలకు ఫలితంగా ఈ జన్మమృత్యు జరావ్యాధులు ప్రాప్తిస్తుంటాయి. కాబట్టి ఇవన్నీ దోషభూయిష్ఠములైనవి. వీనిని గూర్చి నిరంతరం తలుస్తుండడమే ఈ దోషాలను దర్శించడం అన్నమాట.

చేతన ఆత్మతత్త్వమునతప్ప ఈలోకంలో, ఈ నాలుగు దోషాలు లేని వస్తువు ఇంచుమించుగా ఏదీలేదు. గృహముంది చూడండి! అది జడపదార్థము. అది ఒకనాడు నిర్మింపబడుతుంది. అలా నిర్మింపబడడమే దానికి జన్మ. కొద్ది రోజులలోనే ఎక్కడో ఒకచోట విరగడమో, పగులుచూపడమో జరుగుతుంది. అదిదానికి సంభవించిన వ్యాధి. మరమ్మత్తులు చేశాము. అది చికిత్స. పాతబడిపోతుంది. అది దాని వార్ధక్యము. క్రమంగా శిథిలమై కూలిపోతుంది. అది దాని మరణము. చిన్నపెద్ద వస్తువులన్నిటి పరిస్థితి కూడ ఇట్టిదే. కాబట్టి యీ విధంగా లోకములోని వస్తువులన్నిటియందూ ఈ నాలుగు దోషాలున్నాయని గుర్తించి వానియందు వైరాగ్యాన్ని పెంచుకోవాలి.

ఈ విధముగా మహాత్ముడు చేసిన ఉపదేశాన్ని ఆలకించి మహారాజు తన రాజభవనానికి మరలి వచ్చాడు. మహాత్ముని ఉపదేశానుసారం సాధన చేయసాగాడు. అట్లు చేయగా చేయగా అనతికాలమందే అతనికి కూడ తన శరీరమునందు సంసారమందు తీవ్రమైన వైరాగ్యం సిద్ధించింది. అప్పుడు రాణిని వెంటబెట్టుకొని అతడు మరల మహాత్ముని సన్నిధికి వెడలి ఆయనతో – "మహాత్మా! తమ ఉపదేశం వలన నాకు ఎంతో లాభం చేకూరింది. ఇక జనార్దనుని యువరాజ్యపదవియందు పట్టాభిషిక్తుని గావించి నేను శేషజీవితాన్ని భక్తిజ్ఞానవైరాగ్యసంబంధమైన సాధనలతో గడుపుటకు నిశ్చయించుకున్నానని" చెప్పాడు. అప్పుడు మహాత్ముడు జనార్దనుని పిలిచి "వత్సా! ఇక నీవు రాజ్యకార్యాన్ని చూచుకొనుము. ఇక నీకు

భయము లేదు. అందుచే ఇంకనీ తండ్రికి అవకాశమిమ్ము. దీనిచే ఆతడునూ భజనధ్యానములు చేసి ఆత్మకల్యాణం చేకూర్చుకోగలుగుతాడు" అని అతనితో చెప్పాడు.

జనార్దనుడు విజ్ఞానానంద ఘనపరమాత్మయందు నిత్యస్థితిని పొందియే యున్నాడు. అనగా జీవన్ముక్తుడై యున్నాడన్నమాట. అతడు సహర్షంగా రాజ్యసంబంధమైన బాధ్యతలను గ్రహించి రాజ్యపాలనం చేయసాగాడు. అప్పుడప్పుడు విష్వక్సేనుడు రాణితో మహాత్ముని సన్నిధికి వచ్చి సత్సంగంలో పాల్గొనేవాడు. ఆయన సూచనలమేరకు అభినివేశంతో సాధనలు కూడ చేయడం మొదలుపెట్టాడు.

ఆ విధముగా సాధనలు చేసి ఒకనాడు మహారాజు మహాత్ముని సన్నిధికి వచ్చి ఆయనకు పాదాభివందనం చేసి – "గురుదేవా! నాకు కూడ జనార్దనునకు వలె జీవన్ముక్తస్థితి ప్రాప్తించే విధముగా భక్తి జ్ఞానవైరాగ్యాలను గూర్చి తాత్త్వికమైన ఉపదేశం చేయండి" అని ఆయనను కోరాడు.

అప్పుడు మహాత్ముడు జనార్దనునకు ఉపదేశించిన విధంగానే విస్తృతమైన ఉపదేశం చేశాడు. అనంతరం ఆ ఉపదేశాన్ని అనుసరించి మహారాజు, రాణి శ్రద్ధా, ప్రేమపూర్వకంగా పట్టుదలతో సాధన చేశారు. తత్ఫలితంగా వారికి అనతికాలంలోనే పరమాత్మప్రాప్తి సిద్ధించింది. తద్వారా వారు కూడ జన్మసార్థక్యాన్ని పొందగలిగారు.

ఇప్పుడు ఈ కథవలన మనం గ్రహించదగినది ఏమి? అన్నది ప్రశ్న. జనార్దనునివలె మనంకూడ సంసారం విషయంలోను, శరీరం విషయంలోను విరక్తిని పెంచుకొని పైన చెప్పిన సాధన పద్ధతులను అనుసరిస్తూ మన శేషజీవితకాలాన్ని అంతనూ భక్తి జ్ఞాన వైరాగ్యసత్సంగ స్వాధ్యాయాదులందు వినియోగించి జన్మసాఫల్యాన్ని పొందాలి అన్నది నీతి.

~~~oOo~~~
~~~

# 4. భగవానుని పరమదివ్యగుణసంపన్న స్వరూప ధ్యానము

లోకంలో మానవుడు పరమశ్రేయస్సును పొందాలంటే వానికి భగవద్ధ్యానాన్ని మించిన ఉత్తమసాధనం వేరొకటిలేదు. కాబట్టి అతడు నిత్యము శ్రద్ధతోను, ప్రేమపూర్వకంగాను, నిష్కామభావంతోను భగవద్ధ్యానం చేస్తుండాలి. ఏకాంతవాసము, సజ్జనసాంగత్యము, సచ్ఛాస్త్రాల పఠనమననాలు, నామజపము, స్వరూపస్మరణము, లీలాగుణ ప్రభావాదుల చింతనము, తత్త్వరహస్యపరిజ్ఞానము, భగవానునియెడల శ్రద్ధ, ప్రేమ, సాంసారిక భోగాలపై విరక్తి, తద్విరమణము – ఇవియన్నీ భగవద్ధ్యానానికి సహాయపడే అంశాలు, కారణమేమంటే భగవానుని నామాన్ని జపించడంవలన తత్స్వరూపస్మృతి, దానివలన చరిత్ర (లీలా) స్మృతి, దానివలన అతని గుణప్రభావాల అనుభవము కలుగుతాయి. వీనినన్నిటినీ స్మరిస్తూ మననం చేస్తూ ఉండడంవలన భగవానుని తత్త్వరహస్యం తెలియవస్తుంది. దానివలన భగవానునియందు శ్రద్ధ, ప్రేమ, పెంపొందుతాయి. అప్పుడు సాంసారిక భోగాలమీద విరక్తి కలిగి వానిని విరమించడం సంభవమై భగవద్ధ్యానంలో ప్రగాఢస్థితి సమకూరుతుంది.

కాబట్టి సగుణ, సాకార, నిర్గుణ, నిరాకార భగవద్రూపాలలో దేనియందు అభిరుచి ఉంటే దానినే మానవుడు తన యిష్టదేవతాస్వరూపంగా భావించుకొని ధ్యానంచేస్తుండాలి. అసంఖ్యాకము లైన దివ్యగుణాలతో అలరారే భగవానుని సగుణసాకారరూపాన్ని అతని

నిర్గుణనిరాకారతత్త్వంతో సహా ధ్యానం చేయగలిగితే అది మరింత గొప్ప విషయమవుతుంది. అలాంటి ధ్యానమే ఆ పురుషోత్తముని సమగ్రస్వరూపధ్యానం అవుతుంది. దానిని విశదంగా ఎరుకపరచుటకు వలయు ఉపమానాలు, దృష్టాంతాలు, రూపకాలు, ఉదాహరణలేవీ ఈ లోకంలోలేవు. సూర్యుడే లేని అంధకారబంధురదేశంలో ఏ దృష్టాంతం చేతను కూడ సూర్యుడంటే ఏమో తెలియజెప్ప శక్యం కాదు. కారణమేమంటే సూర్యునివంటి వస్తువు వేరొకటేదీ లేదు. అట్టి పరిస్థితిలో తెలియజెప్పడమెలా సాధ్యమవుతుంది? ఆ విధంగానే భగవానుని అత్యంత విలక్షణము, దుర్విజ్ఞేయము అయిన స్వరూపాన్ని ఏ దృష్టాంతం చేతనూ కూడ బోధపరచలేము.

ఆకాశంలో సూర్యుడు ఉన్నాడు కదా! ఆ సూర్యుని కిరణాలలో మనం ఉపయోగించుకొనే నీరు పరమాణురూపంలో ప్రత్యక్షం కాకుండా అవ్యక్తంగా నెలకొని ఉంటుంది. దానిని దూరవీక్షణ (టెలిస్కోపు) యంత్రాలతో కాని, మరి యే యితరసాధనాలతో కాని మనం చూడలేము. ఆ నీరే రసమయమై ఆకాశంలో నిలిచి ఉన్నప్పుడు కూడ మనకు కానరాదు. కాని అక్కడ నీరు ఉందని భావనాదృష్టికి మాత్రం తెలుస్తుంది. ఆ నీరే మేఘరూపంలోను, బిందువులరూపంలోను ఉండి వడగండ్ల రూపంలో వర్షించడం మొదలుపెడితే అప్పుడది ప్రత్యక్షంగా కంటికి దృశ్యమానము అవుతుంది. పట్టుకొనడానికి శక్యమవుతుంది. కనిపించే ఆ నీటితో నిర్వహించుకోవలసిన విధులన్నిటినీ నిర్వహించుకోగలుగుతాము. అయితే యీ నీటి దృష్టాంతము పరమాత్మస్వరూపాన్ని బోధపరచడానికి ఉపయుక్తమయినది కాదు. కారణమేమంటే జలం జడపదార్థం. దానికి పరిణామస్థితి ఉంది. అది నశ్వరము, ఏకదేశీయము అల్పము అయినట్టిది. పరమాత్మ సర్వవిధాల దీనికంటె భిన్నంగా విలక్షణంగా ఉండేవాడు. అతడు నిత్యుడు, చేతనుడు, నిర్వికారుడు, అనంతుడు (అంతము, నాశము లేనివాడు), అనుపమానుడు (పోలికలేనివాడు), అప్రమేయుడు (కొలతకు అందనివాడు) అందుచేత ఆ పరమాత్మ విషయంలో ఉదాహరణలు, దృష్టాంతాలు ఏవీ పనికిరావు. అయినా మహాత్ములు తత్త్వాన్ని బోధపరచడంకోసం ఏదో ఒక దృష్టాంతాన్ని గ్రహించియే బోధించడానికి

ప్రయత్నిస్తూ వచ్చారు. ఉపమానం లేనిదానికి ఏదో ఒక ఉపమానాన్ని గ్రహించడం చేత వారు చేసే బోధ ఆంశికమే అవుతుంది. కాని సమగ్రం కావడం లేదు.

అవ్యక్త కారణరూపంలో నిరాకారంగా ఉన్న నీరే రసరూపంలో ప్రత్యక్షం అవుతుంటుంది. అలాగే నిర్గుణంగాను, నిరాకారంగాను ఉన్న పరబ్రహ్మమే భక్తునిలో భక్తి తీవ్రతను, భావతీవ్రతనుబట్టి విజ్ఞానానందమయము సగుణనిరాకారము అయిన రూపంలో ప్రత్యక్షం అవుతాడు. రసరూపం దాల్చిన నీరే మేఘాల రూపంలోను, బిందువుల రూపంలోను ప్రత్యక్షమై యే విధంగా వడగండ్ల రూపం ధరిస్తుందో ఆ విధంగానే దివ్యములు, చిన్మయములు, నిరతిశయకల్యాణమయములు అయిన గుణసమూహాల మహాసముద్రమనదగిన సగుణనిరాకార పరమాత్మ అవధులు లేనంత మహాప్రకాశరూపంగా ఆవిర్భవించి ఆ ప్రకాశపుంజంలోనుండి నిత్యదివ్యతేజోమయము, సగుణము, సాకారము అయిన రూపంలో ప్రత్యక్షమై కన్నులపండువు చేస్తాడు. అప్పుడు భగవద్భక్తుని దృష్టికూడ దివ్యమైనదిగా పరిణతమవుతుంది. నిజమైన భగవద్భక్తుడు భగవానుని కృపవలన ఈ చర్మచక్షువులతో కూడా ఆ స్వామియొక్క అద్భుతమైన దివ్యమంగళస్వరూపాన్ని తనివితీర చూడవచ్చును. భగవానుని దర్శనం పొందిన భక్తుడు ఆనందపారవశ్యంలో తనను తాను మరచిపోతాడు. ఒక్క భగవానుడు తప్ప వేరుగా ఏదీ అతని తలపులో ఉండదు. గోచరించిన రూపమాధురి యొక్క ప్రభావంచేత దర్శనం పొందినవాని కన్నులకు రెప్పపాటు ఉండదు. అతడు నిర్నిమేషనయనాలతో ఆ రూపమాధురిని అలా గ్రోలుతూ నిలిచిపోతాడు. అనంతరం కొంత సేపటికి స్పృహలోనికి వచ్చినా అతడు తాను చూచిన దివ్యమంగళమూర్తి యిలా ఉంది అని వర్ణించి చెప్పలేడు. కారణమేమంటే అపరిసీమము (మేరలు లేనిది) అప్రమేయము (కొలతకు అందనిది) దివ్యగుణసంపన్నము అయిన ఆ స్వామియొక్క రూపమాధురిని వర్ణించడానికి వాక్కునకు కూడ శక్తి చాలదు. అట్టి పరిస్థితిలో నావంటి సాధారణ మానవుడు ఆ పరమదివ్యసుందరరూపమాధురిని శతాంశమాత్రమైనా వర్ణించడానికి ఎలా సమర్థుడు కాగలడు? అయిననూ

కొందరు ప్రేమమయులైన సోదరుల కోరికమేరకు ఈ విషయంలో నా బుద్ధి ప్రసరించినంతవరకు నాకు తెలిసిన విధమును వివరించుటకు ప్రయత్నిస్తున్నాను. ఇది నా సాహసచర్యమాత్రమే. ఈ విషయంలో నేను తీసుకొంటున్న చొరవను విజ్ఞులు క్షమింతురుగాక!.

భగవానుడు ప్రత్యక్షం కావడానికి ముందుగానే సాధకుని బాహ్యాభ్యంతరాలలోను మనస్సు, బుద్ధి, ఇంద్రియాదులయందు, శరీరగతమైన ప్రత్యణువునందు అనంతము, అతితరదివ్యము, అలౌకికము అయిన చైతన్యము, శాంతి, సమత్వము, ఆనందము నిండుకొంటాయి. అప్పుడు పరమాత్మని సగుణనిరాకార స్వరూపమే, సగుణ సాకారరూపంగా పరిణతమై ఎట్టయెదుట దృగ్గోచరమవుతుంది. సరతిశయ ప్రేమానందస్వరూపుడైన భగవానుని ఆ దివ్యమూర్తి అత్యంతసుందరంగా, అనంతప్రేమమయంగా, అమృతమయంగా, మహోర[illegible]యంగా, పరమానందమయంగా విరాజిల్లుతుంది. ఆ దివ్యసుందర స్వరూపాన్ని ఆపాదమస్తకంగా ధ్యానంచేస్తే సాధకుడు కూడ రసమయుడు, ప్రేమమయుడు, అమృతమయుడు, ఆనందమయుడు అయిపోతాడు. కాబట్టి సాధకుడు ఆ ప్రేమానందమయమూర్తిని సాక్షాత్కరింపజేసుకోవడం కోసం తన సమక్షమందున్న ఆకాశమందు క్రింద వ్రాయబడిన విధముగా భావనారూపధ్యానం చేయాలి.

నా కన్నులకు మూడు మూరలదూరంలో ఆకాశపటలం మీద సాక్షాత్తు విజ్ఞానానందఘనుడైన పూర్ణపరబ్రహ్మ పరమాత్మయే దివ్యము, చేతనము, మహాప్రకాశమయము, సగుణము, సాకారము అయిన శ్రీమహావిష్ణు రూపంలో విరాజిల్లుతున్నాడు. ఆ స్వామి సౌందర్యసారసర్వస్వం అయిన వాడు. మహామహిమోపేతుడు. అతడు నీలకాంతమణివలె శ్యామలచ్ఛాయ కలవాడే అయినా దివ్యములు, స్వచ్ఛములు, ఉజ్జ్వలములు అయిన అతితర ప్రకాశరాశుల కారణంగా కించిన్నీలమై, అత్యంతశుభ్రమైన ధావళ్యాన్ని వహించి కోటిసూర్యప్రభాసమానుడై వెలుగొందుతున్నాడు. ఆ స్వామి తేజోమయుడే అయినా అతని ప్రకాశము ఈషణ్మాత్రము వేడిమిలేక

సుప్రసన్నతాహేతువై, శాంతిమయమై చంద్రునివలె సర్వదా చలువలను ప్రకటిస్తున్నది. అతని దివ్యమంగళవిగ్రహం పదునారేండ్ల ప్రాయపు రాజకుమారుని పోలి మూడున్నర మూరల పొడవు, ఒకమూర వెడల్పు కలిగి చూడముచ్చట గొల్పుతూ ఉంది. అతని చరణతలాలు గులాబివన్నె కాంతులను ప్రకటిస్తున్నాయి. వానియందు పతాకరేఖ, యవరేఖ, శంఖరేఖ, చక్రచిహ్నము, కమలరేఖ, వజ్రరేఖ, స్వస్తికచిహ్నము, మొదలైన రేఖాచిహ్నాలు సొబగులీనుతున్నాయి. ఆ స్వామి చరణాలు, వానియందలి వ్రేళ్ళు అత్యంతకాంతివంతములై, కోమలములై, స్నిగ్ధములై, మనోహరములై అలరారుతున్నాయి. ఆ వ్రేళ్ళయందు సంలగ్నములై చంద్రరేఖలవలె చెలువులీను నఖరాజి (గోళ్లపంక్తి) అభూత పూర్వదివ్యరత్నాలా? అనే విధంగా విలక్షణప్రభలను వెలిబెట్టుతున్నది. ఆ స్వామి పాదాలయందు అలంకృతములైన కింకిణీయుతమణిమయ మంజీరాలు (చిరుమువ్వల అందెలు) చేయుసవ్వడి చెవులను తాకినంతనే సాధకుని మనస్సు తల్లీనతను పొంది మంత్రముగ్ధమైనదానివలె స్తబ్ధతను సంతరించుకొనుచున్నది. అతని కుసుమకోమల చరణాల సంస్పర్శము విలక్షణమై, అమృతమయమై, బహుళరోమాంచ (పులకరింత) కారణమై, పరమానందసంధానచణమై పరిఢవిల్లుతోంది. ఆ పరమపురుషుడు కటితటమున కమనీయపీతాంబరమును దాల్చియున్నాడు. ఆ చేలములోపల నుండి ఆ స్వామియొక్క ప్రకాశమయమైన దేహచ్ఛాయవెలికి ఉరుకుతోంది. ఆ దేవుని చక్కని అవయవాలు మృదులములై, స్నిగ్ధములై, కాంతివంతములై కన్నుల పండువు చేయుచున్నవి. సుమకోమలమైన అతని సన్నని నెన్నడుముపై దివ్యమణిరత్నఖచితము, సువర్ణమయము అయిన కటిబంధము (వడ్డాణమువంటి మొలపట్టీ) కలకలలాడుతుంది. బ్రహ్మదేవుని జన్మస్థానమైన ఆ స్వామియొక్క నాభికమలం గంభీరంగాను, ఉదరం త్రివళీయుతమై (మూడు ముడుతలు గలిగి) సుందరంగాను శోభిల్లుతూ ఉంది. అతని వక్షఃస్థలం పరిపుష్టమై, విశాలమై నేత్రపర్వం అవుతుంది. ఆ స్వామికి నాలుగు భుజములున్నాయి. వానిలో రెండు ఒకింత మీదికి ఎత్తబడి రెండుక్రిందకు వాల్చబడి ఉన్నాయి. ఆ బాహువులు ఆజానులంబమానములై, అత్యంత మృదులములై, స్నిగ్ధములై (నునుపు) కాంతిమంతములై, పుష్టములై, బలిష్ఠములై, వర్తులములై, పైవిలావుగలిగి

క్రిందకు పోవుకొలది సన్ననివై చెన్నలరారుతున్నాయి. ఆ చేతులవ్రేళ్ళ యందు సంలగ్నములైయున్న గోళ్ళు జ్యోతిర్మయములై, చిత్తాకర్షకములై దివ్యరత్నాలవలె దీధితులను వెలయిస్తున్నాయి. ఆ స్వామియొక్క కరతలములు ఈషదారుణ్యమును వెలిబెట్టుచూ సుందరములైన శంఖము, చక్రము, కమలము, యవబీజము (యవధాన్యపుగింజ) అంకుశము, పతాక, స్వస్తికము మొదలైన శుభచిహ్నాలతో శోభిల్లుతున్నాయి. నాలుగు చేతుల వ్రేళ్ళయందు రత్నఖచితములు, సువర్ణమయములు అయిన ఉంగరాలు, చేతులందు కంకణాలు, బాహువులందు బాహుపురులు వరలుతున్నాయి. క్రిందకు వాలియున్న చేతులలో కుడిచేతియందు ఓజస్వంతమైన కౌమోదకి అను గద, ఎడమచేతియందు పద్మము చెలువారుతున్నాయి. ఒకింతపైకి ఎత్తబడిన హస్తాలలో ఒకదానియందు జ్వాలజ్వాలామయమైన సుదర్శన చక్రము, ఎడమ హస్తమందు పరమోజ్జ్వలము, ధవళప్రభాభాసమానము అయిన పాంచజన్యశంఖము, అలరారుతున్నాయి. ఆ స్వామియొక్క వినీలకంఠప్రదేశమందు ముత్యాలతో, రత్నాలతో, కూర్పబడి సువర్ణమయములై మనోహరులైన హారాలు, తులసీదళాలతో, దివ్యసుగంధబంధురకల్పతరుకుసుమాలతో కూర్పబడిన మాలలు అనేకాలు మోకాళ్ళ వరకు వ్రేలాడుతున్నాయి. నవనవలాడే కోమలసుమపల్లవమాలికలతో సమలంకృతమై ఆ స్వామియొక్క శంఖమును బోలిన కంఠదేశము చూడముచ్చట గొలుపుచున్నది. ఆ స్వామి వక్షస్థలంమీద రత్నఖచితాలైన చంద్రహారాలు, కౌస్తుభరత్నము బాలసూర్యప్రభలతో భాసమానములు అవుతున్నాయి. ఎడద నడిమిదేశమందు దర్పణంలో ప్రతిబింబములాగున శ్రీవత్సం అనే పుట్టుమచ్చ కొట్టవచ్చినట్లు కానవస్తుంది. దానిపైని భృగులతాచిహ్నాం కూడ చూపరులను ఆకట్టుకుంటున్నది. ఆ పరమపురుషుని మూపులు పుష్టములై, బలిష్ఠములై కోమలములై పొలుపారుతున్నాయి. ఆ మూపులమీద సువర్ణయజ్ఞోపవీతము, జలతారుపనితనము గలిగి అరుణాభమైన ఉత్తరీయము చిత్తాన్ని హరిస్తున్నాయి. ఆ దేవునిగ్రీవాదేశము (కంఠము), గడ్డము చూడచూడ మరింత సుందరంగా చూపట్టుతున్నాయి. ఆ స్వామి పెదవులు, దొండపండ్లా? కెంపులా? లేక పగడాలా? అనునట్లు శోభాయమానాలు అవుతున్నాయి. ఆ దేవుని సుందరదరహాసము

శరదిందువికాసమును తలపింపజేస్తుంది. ఆ స్వామియొక్క వదనం ప్రఫుల్లకమలాన్ని తలపిస్తూ మనోహర దరహాసభాసురమై, పరమశోభాసమన్వితమై, పరమోజ్జ్వలప్రభాపరిపూరితమై, ప్రకాశమానం అవుతోంది. ఆ వదనంలోని రదనపంక్తి (పలువరుస) ముత్యాలపంక్తిని దలపిస్తూ, మల్లెమొగ్గల నిగ్గులను వెదలిస్తూ హృద్యంగా దృగ్గోచరం అవుతూ ఉంది. ఆ స్వామియొక్క వాక్కు స్పష్టమై యిష్టమై తుష్టిప్రదమై, మృదులమై, మాధుర్యధుర్యమై కర్ణములలో అమృతమును చిలికి మనమును పులకింపజేస్తోంది. అతని చెక్కిళ్ళు చక్కదనాలకు ఇక్కలై (స్థానములు) కోమలములై, స్వచ్ఛములై, ఈషదరుణాభ (గులాబివన్నె) వహించి తేజస్వంతములై, కర్ణకుండలరోచులు తమపై ప్రసరింప విలక్షణసౌందర్యాన్ని ప్రకటిస్తున్నాయి. సుందరములు, సువిశాలములు అయిన ఆ స్వామి కర్ణములందు రత్నఖచితములు, సువర్ణమయములు, మకరాకారాలు గలవి అయిన కుండలాలు బాలసూర్యప్రభలను ప్రకటిస్తున్నాయి. ఆ భగవానుని నయనాలు, తామరపూరేకులవలె సువిశాలములై, సుందరములై, తేజస్వంతములై, ప్రఫుల్లకమలాలవలె ఆహ్లాదజనకములై జ్యోతిస్సులను బహిర్గతం చేస్తున్నాయి ఆ స్వామి తనకు నాయందున్న అపరిమేయమైన ప్రేమచేతను, దయచేతను నిర్నిమేషంగా నావంకకే చూస్తూ నామీద ప్రేమను, దయను, ఆనందాన్ని, శాంతిని, సమత్వాన్ని, జ్ఞానాన్ని ఇతరశుభగుణాలను వర్షంగా కురియిస్తున్నారు. షోడశకళాపరిపూర్ణుడైన చంద్రుడు తన కిరణాల ద్వారా ఓషధులన్నిటియందు అమృతరసాన్ని వర్షించే విధంగా ఆ స్వామి తన చల్లని చూపులద్వారా అమృతమయాలైన గుణాలను వర్షించి నా మనస్సును, ఇంద్రియాలను, శరీరంలోని ప్రతి అణువును దివ్యరసముతో ఆప్యాయితం చేస్తున్నాడు. ఆ గుణాలు నాలో ప్రవేశించి నా రోమరోమాన పరివ్యాప్తాలై మేరలు లేనంతగా నాకు చైతన్యాన్ని, ఆనందాన్ని, శాంతిని, ప్రేమమాధుర్యాన్ని అనుభవంలోనికి తెచ్చే విధంగా నాలో పరిణామాన్ని కలిగిస్తున్నాయి. నేను ఆ భగవానుని సౌందర్యసారసర్వస్వసంభరితమైన ముఖారవిందాన్ని చూచి చూచి ముగ్ధుడనయిపోవుచున్నాను. నిర్నిమేషనయనాలతో ఆ స్వామి మూర్తివంకకు చూస్తూ ఉండిపోయి పారవశ్యంలో మునిగిపోతున్నాను. ఆ భగవానుని కనుబొమలు

ధనురాకారములై, తుమ్మెదల పిండువలె నల్లనివై ప్రకాశిస్తున్నాయి. అతని భ్రుకుటి, (కనుబొమల నడిమిముడుత) సుందరంగాను, విశాలంగాను శోభిల్లుతు అతనికి జీవులమీద ఉన్న పరమానుగ్రహాన్ని సూచిస్తున్నది. ఆ స్వామియొక్క ఫాలదేశం ప్రభావంతము, స్నిగ్ధము, విశాలమై శోభిల్లుచుండ అందు కస్తూరీ తిలకం అనూహ్యములైన అందాలను వెలయిస్తూ ఉన్నది. ఆ దేవదేవుని మస్తకం కాంతివంతమై, స్నిగ్ధమై, నల్లనిదై, కుటిలాలకసమలంకృతమై శోభిల్లుచుండ అందలి కేశపాశమందు పారిజాతాదిక కుసుమస్తబకాలు తురుమబడి అపూర్వమయిన అందచందాలను బహిర్గతం చేస్తున్నాయి. ఆ స్వామి తలమీద మణిరత్నఖచితము, సువర్ణమయము, జ్యోతిర్మయము అయిన కిరీటము అపూర్వశోభాసముదంచితంగా అలరారుతూ ఉంది. ఆ భగవానుని ముఖారవిందం చుట్టూ సూర్యకిరణాలవంటి కిరణాలతో ఏర్పడిన ప్రకాశమయపరివేషం హృదయానికి అమితాహ్లాదాన్ని కలుగజేస్తూ ఉంది. ఆ స్వామియొక్క వదనారవిందం శరత్కాలపు చంద్రుని తలపిస్తు కాంతిమయమై, శోభావంతమై, పరమరమణీయంగా పరిఢవిల్లుతోంది. ఆ పురుషోత్తముని మంగళమయవిగ్రహంనుండి మధురాతి మధురమైన దివ్యసుగంధం బహిర్గతమై ఘ్రాణతర్పణం గావిస్తుంది. ఆ సుగంధాన్ని నాసాపుటాలతో గ్రహించినంతనే నాకు అమృతాన్ని సేవించినంత హాయి కలుగుతోంది. ఆ దేవదేవుని దర్శనము, స్పర్శనము, చింతనము సంభాషణము సర్వము ప్రేమమయం. సర్వము రసమయం. సర్వము ఆనందమయం.

ఆ పరమపురుషుని మంగళమయవిగ్రహము, వస్త్రాలు, ఆభరణాలు, అలంకారాలు, ఆయుధాలు, దండలు అన్నీ దివ్యములే. అన్నీ చిన్మయాలే. ఆ భగవానుని సౌందర్యం ఒక్క దేవదానవమానవలోకానికే కాదు. పశుపక్ష్యాదులకు కూడ పరమానందాన్ని పంచి ఈయగలుగునంత మనోహరమైనది. అత్యంత సుందరరూపలావణ్యమయమైన ఆ దేవుని ఆకారాన్ని చూచి తనకట్టి రూపసంపద లేనందులకు మన్మథుడు కూడ తనమనములో ఎంతో కలతను పొందుతుంటాడు. కోటిమంది మన్మథుల సౌందర్యాన్ని అంతనూ క్రోడీకరిస్తే అదికూడ ఆ స్వామియొక్క

సౌందర్యసముద్రం ముందు ఒక్క బిందుమాత్రంగా కూడ నిలువదు. భగవానుని రూపమాధురి భక్తుని చిత్తంమీద ఇంద్రజాలంలాగున పని చేస్తుంది. ఒకమారు కన్నులార ఆ రూపమునుగన్నవాడు ఇక దానిని విడువలేడు, మఱవలేడు. దృష్టిని వేరొకదిక్కునకు మరల్పలేడు. జగతీతలగతమైన సౌందర్యమంతా కూడితే ఆ స్వామిసౌందర్యంలో అత్యల్పాంశమాత్రం కూడ కాదు. అత్యంతప్రీతిహేతుకమైన ఆ స్వామియొక్క సౌందర్యంలోని మహత్త్వాన్ని వర్ణింపగలవాడు ఎవ్వడూలేడు. ఆ స్వామియొక్క ప్రేమమయములైన చూపులు సోకితే చాలు! సాధకుడు భగవత్ప్రేమానందంలో తన్మయత్వం పొందడమే కాదు. అతనిని విస్మరింపలేకపోవడమే కాదు. తన చూపులను అతని సుందరమూర్తి మీదనుండి రెప్పపాటు కాలముకూడ మరలించుకోలేడు. అతని దివ్యమంగళమయమూర్తి యొక్క దర్శనం ఒక్క జాగ్రదవస్థలోనే కాదు. స్వప్నావస్థలో ప్రాప్తించినప్పటికీ సాధకుడు ఆ సంఘటనను జీవితంలో ఇక ఎన్నడూ మరువలేనంత తాదాత్మ్యంతోపాటు ఆ స్వామిమీద అచంచలమైన ప్రేమనిష్ఠను కూడ పొందుతాడు. ఆ రసమయ మూర్తిలోని ఆకర్షణం అత్యంత విలక్షణమైనది. అది ఒక్కమారు తలపునకు వచ్చినా దృగ్గోచరమయినా సాధకుడు ఇక దానిని మరవలేడు. ఆ స్వామియొక్క అమృతమయ రూపసుధనెంత గ్రోలినా సాధకునకు తనివి తీరదు. భగవత్ప్రేమమయమైన ఆ అసంతృప్తిలో అతడు తననుతాను మరచిపోతాడు. ఆ స్వామి గుణాలను అనుక్షణము తలపోసి ముగ్ధుడవుతూ ఉంటాడు.

భగవానునియందు అసంఖ్యాకములైన దివ్యగుణాల సంపద ఉంది. ఆ గుణాలు ఏవంటే – అపరిమితమైన విలక్షణసౌమ్యత్వము, శాంతి, ప్రేమ, సుహృద్భావము, మాధుర్యము, సౌందర్యము, రామణీయకము, రుచిరత్వము, మనోహరత్వము, నిత్యనూతనత్వము, ఔదార్య, వీర్యము, అభిమానరాహిత్యము, నిర్వైరత్వము, భక్తవాత్సల్యము, ప్రేమాధీనత్వము, పతితపావనత్వము, సర్వమంగళ కారకత్వము, సచ్చిదానందస్వరూపత్వము, సర్వారాధ్యత్వము, కృతజ్ఞత, దాతృత్వము, ధార్మికత్వము, సర్వశ్రేష్ఠత్వము, తత్త్వవేత్తృత్వము, బుద్ధిమత్త్వము,

వాగ్మిత్వము(ధారాళంగా మాటలాడగలుగుట) శాస్త్రజ్ఞత, సమస్తభాషాభిజ్ఞత్వము, ప్రియభాషిత్వము, మనస్విత్వము, దక్షత, సర్వచిత్తాకర్షకత్వము, మధురభాషిత్వము, శరణాగతరక్షకత్వము, ఆర్తత్రాణ పరాయణత్వము, శిష్టజనరక్షణము, దుష్టజనశిక్షణము, భక్తజనసౌహార్దము, న్యాయము, దృఢవ్రతము, పాండిత్యము, ప్రతిభ, పరమానందము, పరమగతిత్వము, సర్వసిద్ధి, సమృద్ధి, సర్వవశీకరణసామర్థ్యము, అసాధారణ శోభామయత్వము, సర్వాకర్షకత్వము, సమస్త చమత్కారకారిత్వము, మహామహిమత్వము మొదలైనవి. ఇదిగాక సత్యము, శుచిత్వము, దయ, క్షమ మొదలైన గుణాలు ఇంకనూ ఎన్నో భాగవతంలో వివరింపబడి ఉన్నాయి. ఎలాగంటే భూదేవి ధర్మదేవతతో ఇలా అంది –

శ్లో. సత్యం శౌచం దయా క్షాంతిస్త్యాగ స్సంతోష ఆర్జవమ్ ।
శమో దమస్తపస్సామ్యం తితిక్షోపరతి శ్శ్రుతమ్ ॥

జ్ఞానం విరక్తిరైశ్వర్యం శౌర్యం తేజో బలం స్మృతిః ।
స్వాతంత్ర్యం కౌశలం కాంతిర్ధైర్యం మార్దవమేవ చ ॥

ప్రాగల్భ్యం ప్రశ్రయశ్శీలం సహ ఓజో బలం భగః ।
గాంభీర్యం స్థైర్యమాస్తిక్యం కీర్తిర్మానోऽనహంకృతిః ॥

ఏతే చాన్యే చ భగవన్ నిత్యా యత్ర మహాగుణాః ।
ప్రార్థ్యా మహత్త్వమిచ్ఛద్భిర్న వియంతి స్మ కర్హిచిత్ ॥
(శ్రీమద్భాగవతమ్. 1/16/26–29)

దేవా! ఆ భగవానునియందు, సత్యము, పవిత్రత, దయ, క్షమ, త్యాగము, సంతోషము, సారళ్యము, శమము, దమము, తపము, సమత, తితిక్ష (అపరాధాన్ని సహించడం), ఉపరతి (లాభం కలిగినప్పుడు ఉదాసీనత వహించుట), శాస్త్రవిచారణము, జ్ఞానము, వైరాగ్యము, ఐశ్వర్యము, శౌర్యము, తేజము, పరాక్రమము, స్మృతి, స్వతంత్రత,

కౌశలము, కాంతి, ధైర్యము, కోమలత్వము, ప్రాగల్భ్యము (భయరాహిత్యము), వినయము, శీలము, సాహసము, ఉత్సాహము, మనోబలము, సౌభాగ్యము, గాంభీర్యము, స్థిరత్వము, ఆస్తికత్వము, కీర్తి, గౌరవము అహంకారరాహిత్యము అను ఈ ముప్పది తొమ్మిది గుణాలున్నాయి. ఈ గుణాలు మహత్త్వాభిలాష కలవారు కోరుకోవలసినవి. ఇవిగాక యింకను ఎన్నో గుణాలు ఆ స్వామియందు విరాజిల్లుతున్నాయి.

శాస్త్రాలలో భగవానునకు సంబంధించిన గుణాలు ఇంకనూ ఎన్నో వివరింపబడి ఉన్నాయి. అసంఖ్యాకములైన కారణంగా వానిని ఇక్కడ వివరించడంలేదు. ఈ గుణాలు అప్రాకృతాలైనవి. ఇవి భగవానునియందు పరిపూర్ణపరిమాణంలో ఉన్నాయి. ఉంటాయి. లోకంలోని జీవులన్నిటి యందూ వెలుగొందుతున్న దయనంతను క్రోడీకరిస్తే అదంతా ఆ భగవానునియందు వెలుగొందుతున్న దయాసముద్రంలోని ఒక బిందువుతో కూడ పోల్చబడజాలదు. ఆ విధముగానే అనంతబ్రహ్మాండంలో సర్వత్రా ఉన్న గుణాలన్నీ క్రోడీకరింపబడితే అది అంతా ఆ భగవానుని గుణసాగరంలోని ఒక బిందువుతో సామ్యానికి చాలదు. కారణమేమంటే ఆ స్వామియొక్క సంకల్పశక్తికి సముద్రానికి వలె మేరలులేవు. ఆ అపారశక్తికి సంబంధించిన ఒక అల్పాంశమందు మాత్రమే ఈ సమస్తబ్రహ్మాండము నెలకొని ఉంది. ఆ దివ్యచిన్మయపరమాత్మయొక్క నిర్గుణనిరాకారతత్త్వమే సగుణనిరాకారతత్త్వంగా పరిణతం అవుతుంది. కాబట్టి యీగుణాలన్నీ దివ్యమైనవి. చిన్మయమైనవి. ఈ గుణాల మహారాశికి సంబంధించిన అల్పాంశంయొక్క ప్రతిబింబమే ఈ విశాలబ్రహ్మాండంలో అనంతగుణాల రూపంలో విస్తరించి భాసిస్తుంది. అందుచేతనే లోకంలో విస్తరించి ఉన్న గుణాలన్నీ ఏకత్రితములైనా అవి పరమాత్ముని గుణసముద్రంలోని ఒక బిందువుతో కూడ సరిపోలవు అని చెప్పడం జరిగింది.

ఆ సగుణసాకారరూపానికి రెండు భేదాలున్నాయి. ఒకటి మాయతో కూడినది. మరియొకటి మాయకు అతీతమైనది. మాయకు అతీతమైనదాని యందు సత్త్వరజస్తమోగుణాలు ఈషణ్మాత్రంగా కూడ ఉండవు. కాబట్టి ఆ రూపంలో ఉన్న భగవానుని గుణస్వరూప ప్రభావాదులన్నీ చిన్మయాలే

అవుతాయి. కాని అవతారధారణం చేసి అందరకు దృగ్గోచరమయ్యే రూపంలో ఉన్నప్పటి భగవానుడు మాత్రం మాయాసంబంధం కలిగి ఉంటాడు. ఆ భగవానుడు గీతలో కూడ ఇలాచెప్పి యున్నాడు –

శ్లో. అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్ ।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా ॥
(గీత. 4/6)

నేను జన్మలేనివాడను, నాశంలేనివాడను యుండియు, సకల ప్రాణులకు ప్రభువును అయియుండియు, నా ప్రకృతిని అధీనం చేసుకొని నా యోగమాయ ద్వారా బహిర్గతమగుచు (అవతరించుచు) నుందును.

నిజమైన మాయాతీతస్వరూపం అందరకు గోచరించదు. కారణమేమంటే అందరు దానిని చూచుటకు అధికారులు కారు. అందుచేత భగవానుడు మాయావరణంలో విలీనుడై ఉంటాడు. ఈ విషయం కూడ అతడు గీతలో ఒక చోట వివరించాడు.

శ్లో. నాహం ప్రకాశ స్సర్వస్య యోగమాయాసమావృతః ।
మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్ ॥
(గీత. 7/25)

నా యోగమాయ ముసుగులో దాగియుండిన నేనందరకు గోచరించువాడను కాను. అందుచే అజ్ఞానముతో కూడిన యీ జనసముదాయము, జన్మయు నాశమును లేని పరమేశ్వరునిగ నన్ను తెలియజాలదు. అనగా నన్నును పుట్టుచు, గిట్టుచుండు వానినిగా భావింతురు.

అయినా భగవానుని తత్త్వరహస్యం తెలుసుకొన్న భక్తుడు ఎవడైతే ఉంటాడో వానికి మాత్రం ఆ స్వామి తన మాయావరణం తొలగించి నిజరూపాన్ని దర్శింపజేస్తాడు. అట్టి దర్శనం పొందిన మనుష్యుడు

అవశ్యంగా కృతకృత్యుడు అయిపోతాడు.

నిజానికి ఆ భగవానుడు ఈశ్వరులకు కూడ ఈశ్వరుడైనవాడు. అతడు అజన్ముడు. అవినాశి అయినా లోకకల్యాణంకోసం ప్రత్యక్షం అవుతు మరల కనుమరుగవుతుంటాడు. ఏ మానవుడు పరమాత్ముని ఆవిర్భావంలోని దివ్యత్వాన్ని, అలౌకికత్వాన్ని తాత్త్వికంగా తెలుసుకొంటాడో అతడు ఆ పరమాత్మను పొందుతాడు. (గీత. 4/9)

ఆ భగవానుని ప్రభావం కూడ అతిశయమైనది. అప్రమేయమైనది. (కొలతకు అందనిది) దివ్య మైనది. అతనిలో బలము, ఐశ్వర్యము, తేజస్సు, శక్తి, పరాక్రమము, ప్రతాపము, సామర్థ్యము, విభూతి, మహిమ, కాంతి, సర్వజ్ఞత్వము, సర్వకారణత్వము, సర్వాధారత్వము, సర్వవ్యాపకత్వము, సర్వనియంతృత్వము, సర్వేశ్వరత్వము, సర్వాంతర్యామిత్వము మొదలైన అసంఖ్యాక విలక్షణప్రభావాలు నిండార ఉన్నాయి. సూర్యుడు ఉదయించినంతనే అంధకారమంతా ఎలా అంతరించిపోతుందో అలాగే పరమాత్మను స్మరించినంతనే, ధ్యానించినంతనే మానవునిలోని దుర్గుణాలు, దురాచారాలు, దుర్వ్యసనాలు, అలసత్వము, ప్రమత్తత మొదలైన సర్వవికారాలు, క్లేశాలు, దోషాలు అన్నీ సమసిపోతాయి. మనుష్యుడు సద్గుణసదాచారసంపన్నుడై జననమరణస్వరూపమైన సంసారసముద్రాన్ని తరించిపోయి పరమాత్మను పొందగలుగుతాడు. ఆ పరమాత్మ అనంతుడు, అప్రమేయుడు, చిన్మయుడు అయిన కారణాన అతని ప్రభావంకూడ అనంతము, అప్రమేయము, చిన్మయము అవుతుంది. ఎవని సంకల్పమాత్రాన అనంతబ్రహ్మాండాల సృష్టిస్థితిలయాలు అనాయాసంగా జరిగి పోతున్నాయో, ఎవని కృపాకటాక్షమాత్రాన లక్షోపలక్షలు, కోట్ల ప్రాణులు క్షణంలో ఎలా ఉద్ధరింపబడడం సంభవం అవుతుందో, ఎవడు సంభవాన్ని, అసంభవంగాను, అసంభవాన్ని సంభవంగాను చేయగలడో, ఎవడు జడాన్ని చేతనంగాను చేతనాన్ని జడంగా చేయగలడో, ఎవడు దోమను బ్రహ్మగాను, బ్రహ్మను దోమగాను పరిణతం చేయగలడో ఆ అచింత్యము, అనంతము అయిన ప్రభావంతో విరాజిల్లుతున్న భగవానుని మహత్త్వం

పూర్తిగా వర్ణించుటకు సాధ్యం అగునట్టిది కాదు. సమస్తబ్రహ్మాండాలయందు విభూతి, బలము, ఐశ్వర్యము గలిగి ప్రభావపూరితములు, తేజస్వంతములు అయిన పదార్థాలు ఏవి ఏకొంచెమున్నా అవియన్నీ ఆ పరమాత్మని సంకల్పాంశం లోనివే అవుతాయి. * ఈ విషయంలో భగవానుడు గీతలో ఇలా అన్నాడు.

విభూతియుక్తమైనది అనగా ఐశ్వర్యవంతమైనదీ, కాంతివంతమైనదీ, మరియు శక్తియుతమైనదీ అగువస్తువు ఏదేది కలదో, ఆయా వస్తువును నీవు నా తేజంలోని ఒక అంశముయొక్క అభివ్యక్తి అని తెలిసికొనుము. కనుక ఓ అర్జునా! యింత వివరణమెందులకు? ఈ వివరణ తెలిసికొన్నంత మాత్రాన నీకు ప్రయోజనమేమి? నేనే ఈ సమస్త జగతినంతటినీ, నా యోగబలముచే కేవలం ఒక్క అంశముతోనే ధరించియున్నాను.

చివరకు తేలిన సారాంశమేమంటే ఆ భగవానుని తత్త్వరహస్యాన్ని తెలిసికొంటే చాలు. తక్షణం మానవునకు భగవత్ప్రాప్తి కలుగుతుంది.

కాబట్టి ఆ స్వామియొక్క తత్త్వరహస్యం తెలియడం కోసం మానవులు నిత్యము నిరంతరము గుణప్రభావసమేతంగా భగవత్స్వరూపాన్ని నిష్కామభావంతోను, శ్రద్ధా ప్రేమపూర్వకంగాను ధ్యానం చేస్తుండాలి.

~~~oOo~~~

---

\* శ్లో. యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా ।
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంఽశసంభవమ్ ॥

అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున ।
విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్ ॥
(గీత. 10/41–42)
~~~

# 5. శ్రద్ధ, ప్రేమ, సాధనలో తత్పరత వాని ఆవశ్యకత

నిజం చెప్పాలంటే ప్రేమకు స్థానం అయినవాడు కేవలమొక్క భగవానుడే. మహాత్ములను కూడ ప్రేమించవచ్చును. కాని అంతకంటె వారియందు శ్రద్ధ అధికంగా ఉండాలి. భగవానునియందు శ్రద్ధ, ప్రేమ రెండూ ఉండాలి. కారణమేమంటే అతని స్వరూపము అలౌకికము, దివ్యము, చేతనము అయినది. మహాత్ముల శరీరాలు అట్టివికావు. అవి జడాలు, భౌతికాలు అయినవి. భగవత్స్వరూపాన్ని ప్రేమించడం వలన దర్శించడం వలన మానవునకు శుభం చేకూరుతుంది. కాని మహాత్ముల భౌతికరూపాన్నిమాత్రమే ప్రేమిస్తే ఆ విధముగా శుభం చేకూరదు ముక్తిరాదు. వారిమీద ఉండవలసినది శ్రద్ధ. శ్రద్ధఅంటే వారు చెప్పినట్లు చేయడం. మహాత్ముల శారీరిక సేవ, పూజకూడ ఉత్తమమైనది. కాని నిజమైన మహాత్ములు పరులవలన పూజలను, సేవలను అపేక్షించరు. వారు శారీరిక సుఖాలకు, పేరుప్రతిష్ఠలకు దూరం ఉండే ప్రకృతికలిగుంటారు.

భగవానుని స్వరూపము, లీలలు, ధామము, నామము, గుణాలు వీనిలో దేనిని ప్రేమించినా మానవుడు ఉద్ధరింపబడతాడు. కాబట్టి భగవానుడు ప్రేమింపదగినవాడు. మనకు భగవానునియందు ఉండవలసిన ప్రేమకు భిన్నంగా సంసారము, శరీరము, భార్య, బిడ్డలు, ధనము, గృహము, పేరు, ప్రతిష్ఠ మొదలైనవానియందు ఏ ప్రేమ, ఆసక్తి ఉన్నదో అది ప్రమాదకరమైనది. శాస్త్రాలు, పరలోకము, మహాత్ముడు, పరమాత్మ ఈ అన్నిటియందు శ్రద్ధ ఉండాలి. శ్రద్ధకు అందరూ పాత్రులే. కాని ప్రేమకుమాత్రం భగవానుడొక్కడే పాత్రుడు. లోకంలోని సమస్తప్రాణులకు హితంచేకూర్చుటకు ఉద్దిష్టమైన నిష్కామప్రేమ కేవలమొక్క భగవానుని యందే ఉంది. ఉంటుంది. ఒక మహాత్ముని దగ్గర ఏబది యేండ్ల కాలము నివసించినా అతడు చెప్పినట్లు చేయకుంటే మానవుడు శుభాన్ని పొందలేడు. కల్యాణాన్ని కోరుకొనేవాడు మహాత్ముడు చేసినట్లు చేయాలి. చెప్పినట్లు చేయాలి. ఈ

విషయమే గీతలో ఇలా చెప్పబడింది.

శ్లో. యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః ।
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ॥
(గీత. 3/21)

ఉత్తముడగు పురుషుడు యే (విధముగ) ఆచరణ గావించునో అన్యపురుషులు కూడ, అదే విధముగ నాచరణ చేయుదురు. అతడు దేనిని ప్రమాణముగా చేయునో దాని ప్రకారమే సకలమానవ సముదాయము చేయనారంభించును.

శ్లో. అన్యే త్వేవమజానంతః శ్రుత్వాన్యేభ్య ఉపాసతే ।
తేఽపి చాతితరంత్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః ॥
(గీత. 13/25)

అనగా మందబుద్ధులైన పురుషులు కొందరు ఈ విధము తెలియనివారై తత్త్వజ్ఞానులనుండి జ్ఞానోపదేశమునంది నన్ను ఉపాసింతురు. ఇట్లు శ్రవణపరాయణులైన పురుషులు గూడ మృత్యురూపమైన సంసార సాగరమును నిస్సందేహముగా దాటుచున్నారు.

సారాంశమేమంటే మహాత్ములు చెప్పినట్లు సాధన చేసేవారు వారి మాటలను శ్రద్ధగా పాటించేవారు, వారు చెప్పే విషయాలను ఆలకించడంలో దత్తచిత్తులై ఉండేవారు అయిన పురుషులు విధిగా సంసారసముద్రాన్ని తరించిపోగలుగుతారు. అయితే వినడంలో దత్తచిత్తులు కావడమంటే ఏమిటి? అన్నది ప్రశ్న. లేడి ఉన్నది చూడండి అది వీణానాదాన్ని విని పరవశం అయిపోతుంది. ఆ సమయంలో తనను ఎవరైన పట్టుకుంటారేమో లేక తనప్రాణాలు తీస్తారేమో అన్న చింతను, భయాన్ని అది యెరుగదు. పూర్తిగా అది ఒడలు మరచిపోతుంది. ఆ విధముగానే మనం కూడ మహాత్ముల మాటలను వినడంలో సర్వాన్ని మరచిన విధంగా మనస్సును లగ్నంచేయాలి. వారు చెప్పేవిషయాన్ని

అర్థం చేసుకోవాలి. తదనుసారంగా ఆచరణ చేయాలి. ఎక్కడ అయినా ఆలకించే వారు అధికంగానే ఉంటారు. విన్న దానిని ఆచరణలో పెట్టేవారు మాత్రం తక్కువగా ఉంటారు. మహాత్ములు చెప్పినదానిని విని ధారణ చేసుకొని పాలనం చేసేవాడు లాభాన్ని పొందుతాడు. విన్న విషయాల్ని మనం ధారణలో నిల్పుకోవడంలేదంటే అందుకు మనలో తగినంత శ్రద్ధలేకపోవడమే కారణం. శాస్త్రప్రసంగాలను మహాత్ముల ప్రవచనాలను ఆలకించిన మీదట విన్నదాని మీద విశ్వాసం కుదిరి చచ్చినా, బ్రతికినా దానిని ఆచరించి తీరాలన్న నిశ్చయబుద్ధి ఎవరికి కలిగితే వారికి శుభం చేకూరుతుంది. ఎవరూ ఎట్టి పరిస్థితిలోనూ స్వధర్మాన్ని విడిచిపెట్టకూడదు. స్వధర్మాచరణంలో మరణము సంభవించినా అది శ్రేయస్కరమే అగును. (స్వధర్మే నిధనం శ్రేయః 3/35) అని భగవద్గీత చెబుతోంది. కాబట్టి యీ విషయంలో శ్రద్ధ చాల అవసరం. ఆ శ్రద్ధ ఎంత అధికంగా ఉంటే అంత శీఘ్రంగా శాంతి లభిస్తుంది. ఇక్కడ గీత ఏమంటున్నదో చూడండి,

శ్లో. శ్రద్ధావాంల్లభతే జ్ఞానం తత్పరః సంయతేంద్రియః ।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతిమచిరేణాధిగచ్ఛతి ॥
(గీత. 4/39)

జితేంద్రియుడు సాధనాపరాయణుడు శ్రద్ధాళువునగు మానవుడు జ్ఞానమును బడయుచున్నాడు. మరియు జ్ఞానము పొందిన క్షణముననే ఎట్టి ఆలస్యమును లేక, భగవత్ప్రాప్తిరూపమగు పరమ శాంతిని పొందుచున్నాడని భావం.

శ్రద్ధావంతుడు జ్ఞానాన్ని పొందుతాడంటే ఎలాంటి శ్రద్ధావంతుడన్నది ప్రశ్న. సాధనలో తత్పరుడైనవాడన్నమాట. ఇక్కడ ఈ విశేషణం ఎందుకు ప్రయోగించబడినది? సాధకునకు సాధనలో ఎంత తత్పరత ఉంటే అంత శ్రద్ధ ఉందన్నమాట. శ్రద్ధకు గీటురాయి తత్పరత్వమే. లోభగ్రస్తుడైన మానవునకు లాభదాయకమైన వస్తువుమీదనే విశేషాభిరుచి ఉంటుంది కదా! అలాగే మేలును కోరుకొనే మానవుడు సాధనవలన శుభం చేకూరుతుంది అనే దృఢనిశ్చయం కలవాడు కావాలి. అలా అయిననాడు వాని సాధనలో

లోపమన్నది కలుగదు. శ్రద్ధావంతునకు జ్ఞానం ప్రాప్తిస్తుంది. జ్ఞానంవలన పరమశాంతి చేకూరుతుంది. అయితే తత్పరత్వం లేనిచోట శ్రద్ధ ఉండదన్నమాట. దీని తరువాత "సంయతేంద్రియః" అని మరియొక విశేషణం ప్రయోగించబడింది. అంటే ఇంద్రియాలను, మనస్సును వశపరుచుకొన్నవాడు అన్నమాట. ఇంద్రియాలమీద, మనస్సుమీద అదుపులేనివాడు నిండు తత్పరతతోడ సాధన చేసేవాడు కాడు. కాబట్టి భగవానుని మాటలమీద, మహాపురుషుల వచనాలమీద విశేషంగా శ్రద్ధ ఉండాలి. మరణం సమీపించినప్పుడు లక్షరూపాయలు వెచ్చించినా క్షణం అవకాశం కూడ లభించదు. ఏడ్చినా ప్రయోజనం ఉండదు. అక్కడ ఏ సిఫార్సులూ చెల్లవు. ఆ పరిస్థితిలో పరమాత్మప్రాప్తి కలిగేవరకు విశ్రాంతి తీసుకోకపోవడమే కర్తవ్యం. మాటలాడడానికి కూడ ఎవరికీ అవకాశం ఇవ్వకూడదు. సాధనలో ఏ కొంచెమయినా లోపం జరిగి భగవత్ప్రాప్తి కలుగకుండా ఇహలోకాన్ని బాసిపోవలసిన పరిస్థితి తటస్థిస్తే మానవునకు ఎలాంటి పరిస్థితి దాపురిస్తుందో, ఏ యోనిలో జన్మించవలసినస్థితి ప్రాప్తిస్తుందో చెప్పలేము. మానవేతరములైన యోనులన్నీ భోగయోనులు. ఈ మానవయోనియందు మాత్రమే భగవత్ప్రాప్తి సాధ్యము, సహజము అవుతుంది. కాబట్టి ఆ పరిస్థితిలో మనం మరియొక జన్మ రావడానికి అవకాశం ఎందుకు ఇవ్వాలి? ఈ జన్మలోనే కార్యసాధన చేసుకోవాలి. లేకుంటే చాల ప్రమాదం. తత్పరతతో సాధన చేయడం జరిగితే ఈ జన్మలోనే పరమకల్యాణం సాధించవచ్చును. ఈ విషయంలో దృష్టాంతంగా చెప్పుకోదగిన కథ ఒకటి ఉంది –

ఒకానొక గ్రామంలో ఉన్నతశ్రేణికి చెందిన మహాత్ముడు ఒకడుండేవాడు. అతని దగ్గరకు ఎందరో జనులు వస్తుండేవారు. ఆ వార్త ఆ ప్రాంతాన్ని ఏలే మహారాజుకి తెలిసింది. జనులు ప్రేరేపించగా ఒకనాడు అతడుకూడ మహాత్ముని దర్శించుటకు వచ్చాడు. అతడు కామాతురుడు, భోగవిలాస పరాయణుడు అని ఆ మహాత్ముడు ముందే యెరుగును. అతడు చక్కబడితే అతనితో పాటు ప్రజలుకూడ లాభాన్ని పొందుతారని మహాత్ముని ఆలోచన. మహారాజు వచ్చాడు. కుశలప్రశ్నలైన పిమ్మట అతడు– "మహాత్మా! నేను ఎంతమంది స్త్రీలతో సాంగత్యం చేసినా నాకు

ఇంచుకంత కూడ అలసట కలుగకుండునట్లు చేయగల మందు ఏదైనా (ఔషదము) ఉంటే నాకు ఈయండి" అని మహాత్ముని కోరేదు. అంతట మహాత్ముడు తన కుటీరంలోపలనుండి ఒకమందు సీసాను తెప్పించి రెండుచుక్కల మందు మహారాజుకిచ్చి మిగిలినదంతా స్వయంగా తాను త్రాగేశాడు. అనంతరం మహారాజు తన గృహానికి వెళ్ళేడు. నాటిరాత్రి అతనిలో కామప్రవృత్తి జాగృతమయింది. అప్పుడతడు తన రాణులకందరకు తృప్తికలిగించాడు. కాని స్వయంగా అతనికే తృప్తి కలుగలేదు. అతనిలో కామప్రవృత్తి యింకనూ ప్రబలంగానే ఉండిపోయింది. మూడునాళ్లు గడచిన మీదట అతడు మరల మహాత్ముని సన్నిధికి చేరి –"అయ్యా! మీ మందు బాగుగా పనిచేసింది. నాకు మరిరెండు చుక్కల మందు ఇవ్వండి" అని అతనిని కోరాడు. అట్లే అతనికి మహాత్ముడు మందు ఇచ్చాడు. ఆ విధముగా మహారాజు మూడు నెలలవరకూ ప్రతి మూడవనాడు మహాత్ముని దగ్గరకు వచ్చి మందు సేవించి కామోపభోగాలను అనుభవిస్తున్నాడు. ఆ మహాత్ముడు కూడ ప్రతిసారి మహారాజు సేవించగా మిగిలిన మందునంతనూ స్వయంగా తానే త్రాగివేస్తూ వచ్చేడు. ఇలా ఉండగా ఒకనాడు మహారాజు – "మహాత్మా! నేను రోజురోజూ మీ దగ్గరకు రానక్కర లేకుండా నాలో ఎల్లవేళలా కామప్రవృత్తి ప్రబలంగా నిలిచి ఉండే విధముగా మందు ఇవ్వండి" అని మహాత్ముని కోరెను. మహాత్ముడు అతనికి ఒక సీసాడు మందు పూర్తిగా త్రాగించివేశాడు. అప్పుడు మహాత్ముడు – అయ్యయ్యో! నేను చాల పొరపాటు పనిచేశానన్నాడు.

మహారాజు – ఏమి?

మహాత్ముడు – ఏమని చెప్పను? ఇక నీవు మూడునాళ్లకంటె ఎక్కువ కాలం బ్రతుకవు.

మహారాజు – ఏమి? నేను చనిపోయెదనా?

మహాత్ముడు – అవును. చనిపోయెదవు.

మహారాజు – బ్రతుకడానికి మార్గమేదీలేదా?

మహాత్ముడు – ఒకింత ఆలోచించి ఉంది. కాని అది బహుకష్టసాధ్యం అయినదన్నాడు.

మహారాజు – చెప్పండి. ఎంత కష్టసాధ్యమయినా నేను చేస్తాను.

మహాత్ముడు – అయితే విను! ఇది మొదలు చనిపోయేవరకూ భగవంతుని నామరూపాలను క్షణంకూడ విస్మరించకుండా ఉండు.

మహారాజు – సరె! అలాగే చేస్తాను.

అనంతరం అతడు తన మందిరానికి తిరిగి వెళ్ళేడు. ఒక ఏకాంతగృహంలో ప్రవేశించి కూర్చున్నాడు. తన దగ్గరకు ఎవ్వరూ రావలదని, వచ్చినవారికి మరణశిక్ష విధించబడుతుందని చాటింపు వేయించాడు. అతడు భగవద్ధ్యానభజనాలలో మునిగిపోయాడు. అన్నపానాల చింతలేదు. మలమూత్రవిసర్జన చింతలేదు. అలా ధ్యానం చేయగా అతనిలో అహంకారం అంతరించిపోయింది. అనతిసమయంలోనే అతనికి సమాధిదశ ప్రాప్తించింది. వారం రోజులు గడచినా అతని సమాధిదశ తొలగలేదు. మూడునాళ్ళలో మరణించవలసిన పరిస్థితి అతనిది. వారం రోజులు గడిచాయి. మహారాజు ఏమయ్యేనో బయటివారికి తెలియలేదు. వారు వచ్చి బలవంతముగా తలుపులు తెరచేరు. మహారాజు ఇంకా సమాధిలోనే ఉన్నాడు. జనులు కోలాహలం చేశారు. దానితో అతనికి సమాధిభంగం అయింది. అతడు కన్నులు తెరచేడు. మూడునాళ్ళు గడవకముందే తలుపులు ఎందుకు తెరిచారు? అని జనులను అడిగాడు. మూడు నాళ్లు ఏమి? ఏడురోజులు గడిచాయి మహారాజా! అని వారు బదులు చెప్పారు. మూడు నాళ్లలో మరణిస్తావని మహాత్ముడు నాతో చెప్పియున్నాడు కదా! మరి నేనేల మరణించలేదు? అని తనలో తర్కించుకొని మహారాజు మరల మహాత్ముని దగ్గరకు వెళ్ళాడు. జరిగిన సంఘటనము అంతా అతనితో చెప్పేడు. అప్పుడు మహాత్ముడు –"ఏమి?

ఇంకా నీలో "నేను" అనేది మిగిలి ఉందా? అని మహారాజును ప్రశ్నించాడు".

మహారాజు – లేదు.

మహాత్ముడు – నీలో "నేను" (అహంకారం) అనేది ఏది ఉన్నదో అది అంతరించిపోయింది. మరణించింది. ఇక శరీరం మరణించవలసిన పనిలేదు.

మహారాజు – మీరు రోజూ సీసాడు మందు త్రాగివేసేవారు. అయినా అది మీ మీద ఎలాంటి ప్రభావాన్నీ చూపలేదే? రెండు చుక్కల మందే నామీద విశేష ప్రభావాన్ని చూపిందేమి?

మహాత్ముడు – ఏడు రోజులకు ముందు నీవు కూడ సీసాడు మందు సేవించినవాడవే కదా! అది అప్పుడు నీ మీద ప్రభావాన్ని ఏల చూపలేదు?

మహారాజు – మహాత్మా! అప్పుడు నాదృష్టి మూడునాళ్లలోనే ప్రాప్తించనున్న మృత్యువు మీదనే నిలిచిపోయింది. ఆ కారణంగా ఆ సమయంలో నాకు నా దారాపుత్రాదులు కూడ తలపునకు రాలేదు.

మహాత్ముడు – అవును. ఆ మాట నిజం. నీకు ఆ మూడునాళ్లే మృత్యువుమీద దృష్టి నిలిచింది. కాని నాకు అనుక్షణము దాని మీదనే దృష్టి నిలుస్తోంది. ఆ పరిస్థితిలో మందు నా మీద ఎలా ప్రభావము చూపుతుంది?

ఇదే విధంగా జనులారా! మనం కూడ సమయం అమూల్యమైనదనీ, మృత్యువు చేరువగా ఉందని అనుక్షణము తలచుకొంటూ ఉంటే అనతికాలంలోనే మనకు పరమకల్యాణం చేకూరుతుంది. మహారాజు ఎంత కాముకుడో తెలుసుకున్నారు కదా! అయినా అతని దృష్టి భగవానునిమీద లగ్నం కావడంతో ఏడు రోజులలోనే

శుభాన్ని పొందాడు.

ఆ విధముగా అతని మనస్సులగ్నం కావడానికి అతనిలో తాను మూడునాళ్లలోనే మరణింపనున్నానన్న నమ్మకం కుదరడమే కారణం. అందుచేతనే అతడు అన్నపానాలను కూడ వీడి భగవద్ధ్యానంలో నిమగ్నుడు కాగలిగాడు. మనమూ ఈ విషయం అనుక్షణము గుర్తుంచుకొంటూ భగవద్ధ్యానంలో అహర్నిశలు నిమగ్నులం కాగలిగితే ఆ విధమైన పరమకల్యాణాన్ని శీఘ్రంగా పొందగలమనడంలో సందేహంలేదు. మనం భూమిమీద ఉండేకాలం బహు అల్పమైనది. కాబట్టి అందలి ప్రతివస్తువు విలువగలదని మనం గుర్తించాలి. ఈ జన్మలో మనం పరమకల్యాణాన్ని పొందలేకపోతే ముందుముందు మనకు బహుప్రమాదకరపరిస్థితి ఎదురవుతుంది. ఒక్క భగవానుడుతప్ప మనలను మరెవ్వరూ రక్షించలేరు అని, మనం అనాథలవలె మృత్యువుపాలు అయిపోతాము అని, అది అనుక్షణము మనలను వెన్నంటి యున్నదని భావించుకొని పరమాత్మధ్యానంలో నిమగ్నులం కావాలి. అదే పరమకల్యాణం పొందడానికి ఉపయుక్తమైన మార్గం.

**ప్రశ్న – బొత్తిగా బుద్ధి, వివేకము, జ్ఞానము లేని మానవుడు ఉద్ధరింపబడుటకు వీలు ఉన్నదా?**

సమాధానము – ఉంది. ఎలాగంటే సజ్జనసాంగత్యం చేయడం వలన, వారు సూచించిన మార్గాన్ని అనుసరించడం వలన, శ్రద్ధావిశ్వాసపూర్వకంగా సాధన చేయడం వలన అట్టి మానవుడు ఉద్ధరింపబడతాడు.

**ప్రశ్న – ఏ మానవుడైన మృత్యువు బాగా చేరువయిన మీదట కళ్లుతెరవడం జరిగితే వాడు ఉద్ధరింపబడతాడా? లేదా?**

సమాధానము – ఉద్ధరింపబడుటకు అవకాశముంది. అతడు భగవానుని నామరూపాలమీద విశేషతత్పరత వహించగలగాలి. అలాఅయితే అతడు శీఘ్రంగా శుభాన్ని పొందగల్గుతాడు.

ప్రశ్న– ఒకడు పరమదుర్మార్గుడు, కాముకుడు, భోగవిలాసపరతంత్రుడు, వ్యసనపరాయణుడు అయి ఉంటాడు. అట్టివాడు ఉద్ధరింపబడగలుగునా?

సమాధానము – ఉద్ధరింపబడగలడు. అదికూడ బహుశీఘ్రంగా సాధ్యం అవుతుంది. ముందు చెప్పిన కథలోని మహారాజు ఉద్ధరింపబడలేదా? ఆ విషయం భగవద్గీతలో కూడ చెప్పబడింది.

శ్లో. అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ ।
సాధురేవ స మంతవ్యః సమ్యగ్వ్యవసితో హి సః ॥

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి ।
కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥

మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాం గతిమ్ ॥
(గీత. 9/30–32)

ఎంతటి దురాచారపరుడైనా మానవుడు అనన్యభావంతో నన్ను భజించుచున్నవాడయితే వానిని ఉత్తముడనియే భావించాలి. అతనిని మంచి మనోనిశ్చయం కలవాడనియే తలపోయాలి. అనగా పరమేశ్వరుని భజనతప్ప మరొకటి లేదని యతడు నిశ్చయించుకున్నాడు.

అతడు శీఘ్రంగా ధర్మాత్ముడై శాశ్వతశాంతిని పొందుతాడు. అర్జునా! నా భక్తుడు ఎన్నడును నశించువాడు కాడు అని నిశ్చయముగా యెఱుగుము. పాపజాతులవారు, స్త్రీలు, వైశ్యులు, శూద్రులు సయితము నన్నే ఆశ్రయించి పరమగతిని పొందగలుగుతారు.

ఎంతటి పాపాత్ముడైనను ఉద్ధరింపబడతాడు. కాని వాడు అన్యచింతలను అన్నిటినీ విడిచిపెట్టాలి. అనన్యభావముతో భగవద్భజనం చేయాలి. ఇంతకు ముందు కథలో చెప్పిన మహారాజు భజించిన విధముగా,

ప్రహ్లాదుడు ఏక నిష్ఠభక్తిని ప్రదర్శించిన విధముగా, పతివ్రతాస్త్రీ తన భర్తనే సర్వస్వంగా భావించే విధముగా (అవ్యభిచారిణియైన) ఇటు అటు చలింపనట్టి భక్తిని అవలంబించాలి. ఒక్క పరమాత్ముని మీదతప్ప మరిదేనిమీదను ఇచ్ఛ ఉండరాదు. ఇక దేనిమీదను నిష్ఠవహించరాదు. నిరంతరము భగవానునే భజించాలి. అలాచేస్తే మానవుడు శీఘ్రంగా మహాత్ముడు కావడంలో విలంబం ఏమి ఉండదు. కావలసినది మాత్రం నిరంతరంగా ఏకనిష్ఠభావం కలిగి ఉండడం. ఇలాంటి మహాపాపాత్ములే ఉద్ధరింపబడుతున్నప్పుడు పుణ్యాత్ముల విషయం వేరుగా చెప్పవలెనా? జ్ఞానం కలుగనిదే ముక్తి రాదు అని చెప్పేమాట ఒకటి ఉన్నను భగవత్కృప ఉంటే సర్వమూ సాధ్యమే అవుతుంది. నిరంతరంగా తనను భజించేవానికి భగవానుడు బుద్ధియోగాన్ని ప్రసాదిస్తాడు. భగవానుడు స్వయంగా గీతలో ఇట్లు చెప్పియున్నాడు–

శ్లో. తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే ॥
(గీత. 10/10)

అలా నిరంతరం నా ధ్యానాదులలో మునిగి ప్రేమతో నన్ను భజించునట్టి భక్తులకు నేను ఆ తత్త్వజ్ఞానరూపమగు యోగము నిచ్చుచున్నాను. దానివలన వారు నన్నే పొందుచున్నారు.

శ్లో. తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।
భవామి నచిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్ ॥
(గీత. 12/7)

అర్జునా! నాయందు చిత్తాన్ని లగ్నంచేసి నన్ను ప్రేమించే భక్తులను నేను మృత్యురూప సంసారసముద్రంనుండి శీఘ్రంగా ఉద్ధరించేవాడను అవుతాను.

శ్లో. మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ ।
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః ॥
(గీత. 12/8)

నాయందే మనస్సును లగ్నం చెయ్యి! నాయందే బుద్ధిని లగ్నం చెయ్యి. అటుమీద నీవు నాయందే నివసించెదవు. అనగా నన్నే పొందెదవు. ఈ విషయంలో ఈషణ్మాత్రమూ సందేహం లేదు.

ఈ విషయమువలన తెలియునదేమనగా మానవుడెంత మూర్ఖుడైన భగవానునియందు అనన్యభక్తినిష్ఠ వహిస్తే భగవానుడు వానికి జ్ఞానాన్ని ప్రసాదిస్తాడు. మనుష్యుడెంతటి పాపాత్ముడైనా భక్తిప్రభావంచేత ఉద్ధరింపబడతాడు. మృత్యువు ఎంతో చేరువకు వచ్చిన దశలో కూడ భగవద్భక్తిమార్గాన్ని అవలంబిస్తే చాలు. అతడు ఉద్ధరింపబడడంలో సందేహం లేదు. ఈ భక్తి భగవానుని మీద ప్రేమకలిగిన మీదట ప్రాప్తిస్తుంది. భగవంతుని మీద ప్రేమ అనేది భక్తివలన ఏర్పడుతుంది. ఈ రెండూ ఒకదానిమీద ఒకటి ఆధారపడి ఉండే అంశాలు. కాబట్టి యీ విషయాలను బాగుగా అవగాహన చేసుకొని మానవుడు మృత్యువు తనకు అనునిత్యము సన్నిహితంగా ఉందనీ, కాలం అమూల్యమయినదని భావించుకొని తీవ్రమైన భక్తిసాధనలో నిమగ్నుడు కావాలి. అతడు ఒక్క క్షణంకూడ భగవానుని విస్మరించకూడదు. కారణమేమంటే ఆయువులో ఒక్క క్షణం నిరర్థకంగా గడిచిపోతే లక్షరూపాయలు వెచ్చించినా దానిని మరల పొందలేము. అటుపిమ్మట యేడ్చినా ప్రయోజనం ఉండదు. ఇక ఈ విషయములో ఎవరి సిఫార్సులూ ఏ విధంగాను పనిచేయవు. ఏ విధంగానైనా మూడు నాలుగు గడియలకాలం ప్రాణాలు నిలుపుకోవాలనుకుంటే కూడ అందుకు మార్గమేదీ ఉండదు. మృత్యువు ఎప్పుడు వస్తుందో మనం చెప్పలేము. నేడు వస్తాను, రేపు వస్తాను అని అది మనకు ముందుగా తెలియజేయదు. అందుచేత దానిని నమ్మడానికి వీలులేదు. అనుక్షణము అది మనకు సన్నిహితంగా ఉందని అనుకుంటూ ఉండాలి. నేటిదినం గడచిపోయింది. రేపటిదినం దానిని అనుసరిస్తుంది. దాని మరుసటి దినంమాత్రం దానిని వెంబడించక ఊరకుంటుందా? ఉండదు. కాలచక్రం నిలువదనే యీ సత్యాన్ని అవగాహనకు తెచ్చుకొని మనం పరమాత్మప్రాప్తికోసం తీవ్రప్రయత్నం చేయాలి. భగవానుని ఈనాడు పొంది తీరుతాం. లేకుంటే ప్రాణాలు వీడుతామనే దృఢనిశ్చయం చేసుకోవాలి. ఇతరములైన పనులనన్నిటినీ వీడి ముందు ఈ కార్యసాధనకు

పూనుకోవాలి. కారణమేమంటే మనం ఈనాడు మరణిస్తే రేపు రెండవదినం అవుతుంది. ఇక మనకు ఇక్కడ ఉన్న ధనము, జనము, కుటుంబము, బిడ్డలు, ఐశ్వర్యము మొదలైనవానితో కించిత్తుకూడా సంబంధముండదు. గడచిపోయిన మన తండ్రి, తాత, ముత్తాతలతో మనకు ఇప్పుడు సంబంధం ఉందా? లేదు. ఈ సంబంధాలు కూడ అట్టివే అయిపోతాయి. ఇంతకుముందు మనం ఎక్కడ ఉంటిమో, ఎవరమో, ఏ జాతివారమో, ఏ స్థితిలో ఉన్నామో, అప్పటి మన ఐశ్వర్యమేదో మనకు ఏమైన తెలియునా? తెలియదు. అలాగే మున్ముందు మన భవిష్యత్తు ఎలా ఉంటుందో అదియూ మన ఊహకు అందదు. కాబట్టి ధనాన్ని కూడబెట్టడమే ప్రధానలక్ష్యంగా పెట్టుకొని కాలం గడపివేయడం అనేది పరమమూర్ఖత్వపు చర్యయే అవుతుంది. ముందు జన్మలలో కాలాన్ని ఎలాగూ వ్యర్థంగానే గడపివేసుకున్నాం. ఈ జన్మలో కూడ అలాగే యీ అశాశ్వతవస్తువులకోసం కాలాన్ని ఎందుకు వృథా చేసుకోవాలి? ఈ వస్తువుల మాట అటుంచి యీ శరీరం కూడ మనతో ఉండేది కాదు అన్న విషయాన్ని గుర్తించి అన్నింటిమీద వ్యామోహాన్ని విసర్జించాలి. ధనము, శరీరము, భార్య, బిడ్డలు ఎవరైతే మనకు ఆత్మకల్యాణప్రయత్నంలో సహాయపడతారో వారే మనవారు. మన ఆత్మకల్యాణం విషయంలో ఏ సంపద సహకరిస్తుందో అదియే సంపద. అట్లు కానినాడు అది సంపదకాదు. ఆపద అనుకోవాలి. అలా అనుకొని ఆత్మకల్యాణంకోసం నడుము కట్టుకొని బొందిలో ప్రాణములున్నంతవరకు పాటుపడుతుండాలి. ఈ శరీరం యీనాడే పోవచ్చును. లేదా రేపు పోవచ్చును. భగవానుని మాత్రం మనం మరచిపోకూడదు. శరీరం మరణిస్తుందని మాత్రం మనం చింతించడమెందుకు? కారణమేమంటే మరణ సమయమాసన్నమయి నప్పుడు మరణము తప్పదు. ఈ విషయంలో కూడ ఒక కథ ఉంది –

మార్వాడీ దేశమువాడైన ఒక వ్యక్తియున్నాడు. కాని అతడు పరదేశములో నివసిస్తున్నాడు. అతడు ఇరువది యేండ్లు గడిచాక సకుటుంబంగా స్వదేశంలోని స్వగృహానికి మరలి వచ్చాడు. ఇన్ని యేండ్లుగానూ అతని భవనం మూసివేయబడి ఉంది. అతడు ఆ భవనాన్ని తెరిచాడు. దానిని శుభ్రపరిచాడు. రాత్రి అందతడు శయనించాడు. అంతట

అక్కడకు కొన్ని ప్రేతాలు వచ్చి అతనిని తరుమసాగాయి. ఈ భవనం నాది అన్నాడు మార్వాడి. కాదు మేము ఇందు ఉంటున్నాము. నీవు వెంటనే బయటకు పో! అని ప్రేతాలు హుంకరించాయి. ఈ రాత్రికి మమ్మల్ని ఇక్కడ పరుండనీయండి. రేపు ఉదయం వెళ్ళిపోతాము అన్నాడు మార్వాడి. అట్లని అతడు నిద్రపోయాడు. అనంతరం ప్రేతాలు మళ్ళీ వచ్చాయి. అప్పుడు మార్వాడి – "మరి నాలుగు రోజులు ఉండనీయండి! ఇంటిని చక్కజేసి వెడలిపోతాను" అని వాటిని అర్థించాడు. ఈ విధముగా అతడు ఏదో కారణాలు చెపుతూ ఇల్లు విడిచిపెట్టకుండ రోజులు దొర్లిస్తున్నాడు. ఒకనాడు అతడు పగటివేళ మీరు ఎక్కడ ఉంటున్నారు అని ఆ ప్రేతాలను ప్రశ్నించాడు. యమధర్మరాజు దగ్గర అని అవి బదులు చెప్పాయి. అలా అయితే మీరు నాకు ఒక పనిచేసిపెట్టండి! అది యేమి అంటే మీరు ఒకింత మీ ప్రభువైన యమధర్మరాజును అడిగి మా అందరి ఆయుష్కాలం ఎంత ఉందో తెలుసుకొని నాకు చెప్పండి! అని అతడు వానిని కోరాడు. అందులకు అవి సమ్మతించాయి. మరునాడు అవి మరలివచ్చి అందరి అయుఃపరిమాణము భిన్నభిన్నంగా ఉన్నట్లు తెలియజెప్పాయి. దయచేసి నాకు మరొక్క పనిచేసి పెట్టండి! అదేమిటంటే మీ ప్రభువుతో చెప్పి అతని చేత మా ఆయువులో ఒక్కరోజు తగ్గింపు అయినా చేయించండి లేదా హెచ్చింపు అయినా చేయించండి! అని ఆ మార్వాడి వానిని మరల అర్థించాడు. ఓశ్! ఇదెంత పని? అని అవిపోయి ఆ విషయం యమునితో చెప్పాయి. ఆయుష్కాలంలో అణువంత తగ్గించనూ బడదు. ఆవంత హెచ్చింపనూ బడదు. అది నా శక్తికి అతీతమైన విషయం అని యముడు చెప్పాడు. ప్రేతాలు మరలి వచ్చి ఆ విషయం మార్వాడీకి ఎరిగించాయి. అటుపిమ్మట అవి ఇల్లు విడిచి బయటకు పొమ్మని అతనితో మరలచెప్పాయి. ఏదోసాకు చూపి అతడు మరల నిరాకరించసాగాడు. బయటకు నడవకుంటే నిన్ను చంపివేస్తామని అవి అతనిని హెచ్చరించాయి. అప్పుడతడు – "బాగు! బాగు! ప్రేతములారా! ఆయువు చెల్లక ముందు నన్ను చంపడానికి ఆ యమునకే శక్తి చాలదు కదా! ఇక నన్ను మీరేమి చేయగలరు? కాబట్టి నేను ఇక్కడనుండి కదలను" అని ధైర్యంగా బదులు చెప్పాడు. అంతట ఆ ప్రేతాలు ఇక ఏమీ చేయలేక తామే ఆ తావును వీడి వేరొకచోటకు వెళ్ళిపోయాయి."

కాబట్టి మనం మృత్యువును గూర్చి చింతించనక్కరలేదు. మన ఆయువు ఎప్పుడు చెల్లితే అప్పుడే మరణిస్తాము. ఈలోగా ఎవ్వరు మనప్రాణాలను హరించలేరు. ఎవరు ఎంత ప్రయత్నించినా మన ఆయువులో ఒక రోజు తగ్గనూ తగ్గదు. హెచ్చనూ హెచ్చదు. అందుచేత ఈ శరీరమున్నంత వరకు మనం మన ఆత్మకల్యాణాన్ని కోరి అనుక్షణము భగవానుని మన స్మృతిపథంలో ఉంచుకోవాలి. ఆత్మకల్యాణం పొందకముందే మృత్యువు నోట పడడం, తరువాత అయ్యో! అని వగచడంవంటి పరిస్థితి మాత్రం మనకు రాకూడదు. అట్టి పరిస్థితికి గురయినవాడు పరమందు పరితపిస్తాడని, తలమొత్తుకొని పశ్చాత్తాపంతో బావురుమంటాడని, తన కాలాన్ని, కర్మాన్ని, దైవాన్ని మేలైనవి కాదని నిర్దయములైనవని నిందించుకొంటాడని ఒకయెడ తులసీదాసు కూడ చెప్పియున్నాడు.

కాబట్టి యీ మానవశరీరమును పొందియుండికూడ మనం ఆత్మోద్ధరణం కోసం పాటుపడకుంటే అనంతరకాలంలో పశ్చాత్తాప పడవలసివస్తుంది. మనకు మానవదేహం ప్రాప్తించింది. ఆత్మోద్ధరణంకోసం పాటుపడాలని మనకు భగవానుడు, శ్రుతులు, స్మృతులు, తులసీదాసు కబీరు వంటి సాధుపుంగవులు హెచ్చరికలు చేస్తూనే ఉన్నారు. చూడండి! కబీరు ఏమన్నాడో?

**కబిరా నౌబత ఆపనీ, దిన దస లేహు బజాయ ।**
**యహ పుర పట్టన యహ గలీ, బహురి న దేఖహు ఆయ ॥**

నాయనా! ఈ సమయం ప్రస్తుతం నీది. ఏదో పదిరోజుల పాటు నీ వాద్యం, ఏదో నీవు వాయించుకో! (అంటే నీవు భూమిమీద ఉండేకాలం బహు అల్పమైనది. నీవు పొందే భౌతికానందం అశాశ్వతం అయినది అన్నమాట) ఈ పురాలను, పట్టణాలను, వీధులను మరల వచ్చి చూడలేవు. నీ భౌతికతాపత్రయం ఏదో అలాసాగించి వేసుకో! ఈ మాటలనుబట్టి భౌతికములైనవి సర్వమూ అనిత్యాలు, అల్పకాలికాలు అని గుర్తించి అలౌకికుడైన పరమాత్మను భజించుకో! మానవుడా! అని కబీరు చేసిన

హెచ్చరిక.

అనిత్యమసుఖం లోకమిమం ప్రాప్య భజస్వ మామ్ ॥ (గీత. 9/33)

అశాశ్వతము, సుఖరహితము అయిన యీ మానవశరరాన్ని పొంది నిరంతరము నన్నే భజిస్తుండు అని భగవానుడు చెప్పిన మాట. ఆ భగవానుడే ఇంకనూ ఇలా అనుచున్నాడు.

శ్లో. మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మామేవైష్యసి యుక్త్వైవమాత్మానం మత్పరాయణః ॥
(గీత. 9/34)

నాయందు మనస్సుగలవాడవై, నాభక్తుడవుకమ్ము, నన్ను పూజించుము నాకు వందనము చేయుము. ఈ విధముగ నీ ఆత్మను నాలోనియోగించి నా యందు తత్పరుడవైన నీవు నన్నే చేరుకొందువు.

మహాజనులారా! ఇలాంటి మాటలను మీరు కొన్ని యేండ్లుగా వింటూనే ఉన్నారు. అయినా మీలో ఆశించినంత ఉన్నతి కానరావడంలేదు. ఎందరో మనకు మిత్రులయ్యారు. వారిలో పేదలున్నారు. ధనికులున్నారు. వారందరూ గతించిపోయారు. పెద్దలు పిన్నలూ గతించారు. సాటివారు గతించారు. మనము గతించిపోతాము. యుక్తులతోను, శాస్త్రోక్తులతోను మీకు ఇలాంటి విషయాలు బోధించడం జరుగుతూనే ఉంది. అయినా దీనిని మీరు హృద్గతం చేసుకోవడంలేదు. మహాభారతంలో యక్షుడు ప్రశ్నించినప్పుడు యుధిష్ఠిరుడు ఏమన్నాడో చూడండి –

శ్లో. అహన్యహని భూతాని గచ్ఛంతీహ యమాలయమ్ ।
శేషాః స్థిరత్వమిచ్ఛంతి కిమాశ్చర్యమతః పరమ్ ॥
(వనపర్వం.3/3/116)

ఈ లోకంలో దినదినమూ జీవులు యమలోకానికి పోతూనే

ఉన్నారు. (మరణిస్తూనే ఉన్నారు.) అయినా మిగిలిన ప్రాణులు తమ స్థిరత్వాన్ని కోరుకుంటున్నారు. అంటే అంతకంటె ఆశ్చర్యజనకమైన విషయం వేరుగా ఏమి ఉంటుంది? అని భావం.

కన్నులు తెరవండి! జాగరూకులు కండి! అని ఎందరకో బోధిస్తున్నాము. మిత్రులతో చెపుతున్నాము. అయినా ఎవడూ మామాటను చెవిని పెట్టడంలేదు. అప్పులు తీరిపోయిన తరువాత అయితే మనస్సు కుదురుగా ఉంటుంది అని ఒకడంటాడు. అన్ని సమస్యలు తీరాయి. పిల్లల పెండ్లిండ్ల సమస్య ఒకటి మిగిలి ఉంది. అదికూడ తీరిపోతే నిశ్చింతగా భగవద్భజనం చేసుకుంటాను అని వేరొకడు అంటాడు. నాకు చింతలు ఏవీలేవు. నా కొడుకులు కూడ బుద్ధిమంతులు. ఒక్క సమస్య ఆదాయపుపన్నుకు (ఇన్కంటాక్సు) సంబంధించినది ఉండిపోయింది. ఆ ఒక్కటికూడ తీరిపోతే హాయిగా భగవద్భజనం చేసుకుంటాను. అని మరి యొకడంటాడు. ఇలా ఉంది మా మిత్రుల పరిస్థితి. వారిలో ఎందరో మరణించారు. మిగిలినవారు కూడ మరణించడం తప్పదు. జన్మసాఫల్యంకోసం చేయవలసినది అంతా చేసి ఇక మరణం కోసం వేచి ఉన్నాడు అని చెప్పుకోదగినవాడు ఒక్కడూ కానరాడు. అందుచేతనే నేను అందరితోనూ నాయనలారా! కాలం చాల తక్కువ. వెంటనే తత్పరత వహించి సాధన చేయండి అని హెచ్చరిస్తున్నాను. చేస్తాము. చేస్తాము అని వారు బదులు చెపుతున్నారు. అలాగే, అలాగే చేస్తాం అంటూనే చాలమంది గతించిపోయారు కూడ. ఈ పరిస్థితిలో ఎవరికి ఏమని నచ్చజెప్పగలము? వారు బ్రతికియుండగా అర్థం చేసుకోరు? మరణించిన మీదట తెలియజెప్పడానికి వీలులేదు. ధనచింత, కుటుంబచింత ఉన్నవాళ్లు ఎందరో ఆ చింతలోనే కాలం చేశారు. వారికి చింత తీరలేదు. ఆత్మకల్యాణం చేకూరలేదు. ఇప్పుడు కూడ ఎందరినో జాగృతులు కండి" అని హెచ్చరిస్తూనే ఉన్నాము. అయినా మా మాటను ఎవరూ అర్థం చేసుకోవడం లేదు. అంటే ఇందులో దోషం మాది అంటారా? వినేవాళ్లది అంటారా? భగవానునిది మాత్రం కాదు గదా! అతడు దయామయుడు. అతని దయారసం ఎల్లెడల ప్రవహిస్తోంది. ఆ దయారసం ఇంత అని మనం అంచనా కట్టలేము. ఇక్కడ స్వయంగా భగవానుడు ఏమన్నాడో చూడండి :

**సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి ॥**
(గీత. 5/29)

అనగా నా భక్తుడు నన్ను సకలభూత ప్రాణులకు సుహృదుడుగాను అనగా స్వార్థములేని దయామయుడగు ప్రియుని (ప్రేమించువాని) గాను తత్త్వదృష్టితో తెలిసికొని శాంతిని పొందుచున్నాడు.

భగవానుడు నిర్హేతుకజాయమానకరుణామూర్తి. ఈ విషయం తులసీ రామాయణంలో శివునిచేత ఇలా చెప్పించబడింది.

**"ఉమా రామ సమ హితు జగ మాహీఁ ।**
**గురు పితు మాతు బంధు కోఉ నాహీఁ ।"**

పార్వతీ! లోకానికి శ్రీరామునివంటి హితుడూ, గురుడూ, తల్లీ, తండ్రి, బంధువు వేరెవ్వరూ లేరు అని పై పంక్తుల భావం. ఈ విధముగా భగవానుని దయ సర్వత్రనిండి నిబిడీకృతమై ఉంది. అన్నమాటను మనం మరచిపోకూడదు. అతనిని మనం మన పరమసుహృదునిగా భావించుకోవాలి. భగవానుని వంటి దయామయుడు, పరమప్రేమికుడు మరి యెవ్వరున్నారు? అతనిని శరణుపొందితే పరమశాంతి లభిస్తుంది. ఇచ్ఛాపూర్వకంగాను, అనిచ్ఛాపూర్వకంగాను ఏ సుఖదుఃఖాలు ప్రాప్తించినా వానిలో భగవానుని మంగళమయవిధానమే దాగి యున్నదని భావించుకొంటూ ఉండాలి. అలా అనుకొన్ననాడు మనకు ఏ దుఃఖమూ అనుభవంలోకి రాదు. కడకు పరమశాంతి లభించి తీరుతుంది.

~~~oOo~~~
~~~

# గోపికలు శ్రీకృష్ణుని దుడుకుఁ జేఁతలు యశోదాదేవికిఁ దెల్పుట

క. బాలురకుఁ బాలు లేవని,
బాలింతలు మొఱలు వెట్టఁ బకపక నగి యా
బాలుం డాలము సేయుచు,
నాలకుఁ గ్రేపులను విడిచె సంభోజాక్షీ!

క. పడఁతీ! నీ బిడ్డఁడు మా, కడవలలో నున్న మంచి కాఁగిన పాలా
పడుచులకుఁ బోసి చిక్కిన, కడవలఁ బోనడిచె నాజ్ఞ కలదో లేదో.

క. మీ పాపఁడు మా గృహమున,
నాపోవఁగఁ బాలుఁ ద్రావ నగపడ కున్నన్
గోపించి పిన్నపడుచుల,
వాపోవఁగఁ జిమ్ముకొనుచు వచ్చెం దల్లీ!

మత్తకోకిల. పుట్టి పుట్టఁడు నేఁడు దొంగిలబోయి మా యిలు సొచ్చి తా
నుట్టి యందక ఱోలుఁ బీఁటలు నొక్కత్రో విడి యెక్కి చే
వెట్టఁజాలక కుండక్రిం దొక పెద్దతూఁ టొనరించి మీ
పట్టి మీఁగడ పాలు చేరలఁ బట్టి త్రావెఁదలోదరీ!

క. ఆడం జని మీఁగడ పెరుఁ
గోడక నీ సుతుఁడు త్రావి యొకయించుక తాఁ
గోడలి మూఁతిం జరిమినఁ,
గోడలు ముచ్చనుచు నత్త కొట్టె లతాంగీ!

క. వా రిల్లు సొచ్చి కడవలఁ, దోరంబుగ నెయ్యి త్రావి నా కడవల్
వీరింటను నీ సుతుఁ డిడ, వారికి వీరికిని దొడ్డ వాదయ్యె సతీ!

క. వేలుపు లటె నాకంటెను,
వేలుపు మఱి యెవ్వఁడనుచు వికవిక నగి మా
వేలుపుల గోడపై నో
హేలావతి! నీ తనూజుఁ డెంగిలి చేసెన్.

క. వెన్నఁ దినఁగ బొడగని మా,
పిన్నది యడ్డంబు వచ్చి పిఱిఁదికిఁ దీయన్
జ న్నొడిసి పట్టి చీరెను,
జిన్నికుమారుండె యితఁడు శీతాంశుముఖీ!

క. ఇ మ్మగువ తన్ను వాకిటఁ,
గ్రుమ్మఱుచోఁ జేరి నిలుపుకొని పేరడుగన్
గెమ్మోవిఁ గఱచి వడిఁ జనె,
నమ్మా! యీ ముద్దుఁ గుఱ్ఱఁ డల్పుఁడె చెపుమా!

క. చేబంతి తప్పిపడె నని, ప్రాబల్యముతోడ వచ్చి భవనము వెనుకన్
మా బిడ్డ జలకమాడఁగ, నీ బిడ్డఁడు వలువఁ దెచ్చె నెలఁతుక! తగునే.

క. ఇ చ్చెలువఁ జూచి ప్రముచ్చిలి,
యచ్చపుగ నుఱికించుకొనుచు నరిగెద నాతో
వచ్చెదవా యని యన్నాఁ,
డిచ్చిఱుతఁడు సుదతి! చిత్ర మిట్టిది గలదే!

క. కొడుకులు లేరని యొకసతి,
కడు వగవగఁ దన్ను మగనిఁగాఁ గైకొనినన్
గొడుకులు గలిగెద రని పైఁ,
బడినాఁ డిది వినుము శిశువు పనులే తల్లీ!

క. తలఁగినదానం దల మనఁ,
దలఁగక నేఁ దలఁగ నంచుఁ దగఁ బల్కుచు నీ

తలఁగినచో వెయ్యది యని,
తల యూఁచెన్ నీ సుతుండు తగవె మృగాక్షీ!

క. వ్రాలఁగ వచ్చిన నీ సతి,
చూలాలం దలఁగు మనిన, జూ లగుటకు నే
మూలంబు చెప్పు మనె నీ,
బాలుఁడు చెప్పెదురె సతులు పర్వేందుముఖీ!

క. మగువా! నీ కొమరుఁడు మా,
మగవా రటు వోవఁ జూచి మంతనమునకున్
దగఁ జీరి పొందు నడిగెను,
జగముల మున్నెట్టి శిశువు చదువంబడెనే!

ఆ. నమ్మి నిదురవోవ నా పట్టిచుంచు
లేఁగ తోఁకతోడ లీలఁ గట్టి
వీథులందుఁ దోలె వెలఁది! నీ కొమరుండు
రాచబిడ్డఁ డయిన అవ్వ మేలె?

క. నా పట్టి పొట్టనిండఁగఁ,
బై పడి నీ పట్టి వెన్న బానెం డిడినాఁ
డూపిరి వెడలదు వానిం,
జూపెద నేమైన నీవ సుమ్ము లతాంగీ!

క. తెఱవ యొకతె నిద్రింపఁగ,
నెఱిఁ గట్టిన వలువ వీడ్చి నేటగు తేలుం
గఱపించె నీ కుమారుఁడు,
వెఱచుచు నది పఱవ నగియె విహితమె సాధ్వీ!

క. నా కొడుకును నా కోడలు,
నేకతమునఁ బెనఁగఁ బాము నీతఁడు వైవం

గోక లెఱుంగక పాఱినఁ,
గూఁక లిడె నీ సుతుండు గుణమె గుణాఢ్యా!

ఆ. తరుణి యొకతె పెరుఁగుఁ దఱచుచుఁ దుది వంగి
వెన్నఁ దియ్య నొదిఁగి వెనుకఁ గదిపి
మగువ! నీ సుతుండు మగపోఁడుములు సేయ
సాఁగినాఁడు తగదె చక్కఁజేయ.

సీ. కలకంఠి! మా వాడ గరితల మెల్ల నీ
పట్టి రాఁగలఁ డని పాలు పెరుఁగు
లిండ్లలోపల నిడి యే మెల్లఁ దన త్రోవ
చూచుచో నెప్పుడు చొచ్చినాఁడొ
తలుపులు ముద్రలు తాళంబులును పెట్టి
యున్న చందంబున నున్న వరయ
నొక యింటిలోఁబాడు నొక యింటిలో నాడు
నొక యింటిలో నవ్వు నొకటిఁదిట్టు
తే. నొకట వెక్కిరించు నొక్కొకచో మృగ
పక్షి ఘోషణములు పరఁగఁ జేయు
నిట్లు చేసి వెనుక నెక్కడఁ బోవునో
కానరాఁడు రిత్తకడవ లుండు.

క. కడు లచ్చి గలిగనేనియుఁ,
గుడుతురు గట్టుదురు గాక కొడుకుల నగుచున్
బడుగుల వాడలపైఁ బడ,
విడుతురె రాకాంత లెందు విమలేందుముఖీ!

క. ఓ యమ్మ! నీ కుమారుఁడు,
మా యిండ్లను బాలు పెరుఁగు మననీఁడమ్మా!
పోయెద మెక్కడి కైనను,
మా యన్నల సురభు లాన మంజులవాణీ!

వ. అని మఱియు ననేకవిధంబు లైన బాలకృష్ణుఁడు సేయు వినోదంబులు దమ యందుఁ జేయు మహాప్రసాదంబు లని యెఱుంగక, దూఱుచున్న యట్టి గోపికలకు యశోద యిట్లనియె.

క. చన్ను విడిచి చనఁ డిట్టటు,
నెన్నఁడుఁ బొరుగిండ్ల త్రోవ లెఱుఁగడు నేఁడుం
గన్నులు తెఱవని మా యీ,
చిన్ని కుమారకుని అవ్వ సేయం దగునే.

తే. అన్య మెఱుఁగడు తనయంత నాడుచుండు
మంచివాఁ డీతఁ డెగ్గులు మానరమ్మ!
రామలార! త్రిలోకాభిరామలార!
తల్లులార! గుణవతీ మతల్లులార!

వ. అని యశోద వారల నొడంబఱిచి పంపి, కొడుకుం గోపింపజాలక యుండె. ఇట్లు.

ఉ కాంతలు తల్లితోఁ దన వికారము లెల్ల గణింప భీతుఁడై
శాంతుని సొంపునన్ బరమసాధుని పెంపున గోల మాడ్కి వి
భ్రాంతుని కైవడిన్ జడుని భంగిఁ గుమారకుఁ డూరకుండె నే
వింతయు లేక తల్లి కుచవేదిక నొదల మోపి యాడుచున్.

వ. అంత నొకనాఁడు బలభద్రప్రముఖు లయిన గోపకుమారులు వెన్నుడు మన్ను దినె నని చెప్పిన, యశోద బాలుని కేలు పట్టుకొని, యిట్లనియె.

(మహాకవి బమ్మెర పోతనామాత్య ప్రణీత "శ్రీమహాభాగవతము"నుండి.)

~~~oOo~~~~
~~~